# నవ్య సాహితి

[ కవితా సంకలనం ]




నవ్య సాహితీ సమితి

హైదరాబాదు

ప్రచురణ : ఎనిమిది ప్రతులు వెయ్యి

పుష్యము, విరోధి . శాలివాహన - 1880

సాదాప్రతి : రు. 4-50

గ్రంథాలయ ప్రతి : రు. 5-50

ప్రతులకు :
నవ్యసాహితీ సమితి
208, బోయిగూడా-సికింద్రాబాదు.

ముద్రణ :
అజంతా ప్రింటర్సు
సికింద్రాబాదు.

# నీరాజనము

మా నవ్య సాహితీసమితి "నవ్యసాహితి" అనుపేరిట నొక కావ్య సంపుటిని ఆంధ్ర దేశమునకు సమర్పించుచున్నది ఇందలి రచనలన్నియు మా సమితి సభ్యులవని తెల్పుటకు సంతసించుచున్నాము ఇందలి ప్రక్రియలయొక్కయు, వస్తువుయొక్కయు, రచనావిధానము యొక్కయు వైవిధ్యమువలన దీనిని "కావ్య మణి" అనిన సమంజసమగును వీనిని బట్టి మా సమితియందలి సభ్యుల భావ వైవిధ్యము తెల్లమగును. వివిధ చిత్తవృత్తులును, ఆశయములును గల సభ్యుల నందఱను సహృదయత్వమను సూత్రమే బంధించుచున్నదని వైవిధ్యములో నైక్యత వలన తెలియవచ్చును

రసమనుడు, ఔచితి యనుడు, వక్రోక్తి యనుడు, ధ్వనియనుడు, మరేమి యైనను అనుడు, కావ్యపరనమువలన సహృదయునికి కల్గు ఆనందమున కది మూలము. ఒక్క సహృదయుడే దానిని పొందగలడు. ఒక కావ్యమునకు నికష

మును కోల్రిడ్జియను ఆంగ్లకవి ఇట్లు వివరించినాడు "Not the poem that we have read, but that to which we return possesses the genuine quality of poetry." ఈ యభిప్రాయము మన లాక్షణికులు కూడ చెప్పియేయున్నారు. "రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యం" అన్న వారి నిర్వచనములో రమణీయతను "క్షణేక్షణే యన్నవతా ముపయితి తదేవ రూపం రమణీయతాయాః" అని తెల్పినారు అనగా నొక కావ్యము చదివినతరువాత ఆనందప్రేరితులమై మరల చదువవలెనని పురికొల్పు కావ్యమే నిజమైన కావ్యము ఈ కొలగఱ్ఱతో పరీక్షించి నపుడు ఇప్పుడు గొప్ప కవులనుకొనువారు వ్రాసిన కావ్యములెన్ని పరీక్ష కాగునో? ఈ సహృదయత్వము ఒక్క కాలమునకు సంబంధించినది కాదు సహృదయులు సర్వకాలములయందుందురు వారికి ఆనందము కలుగచేయవలెనని కావ్యము నందు మరియొక ముఖ్యగుణముండవలెను అది సార్వకాలీనత ప్రపంచము నందలి సాహిత్యములలో ఈ గుణముకల్గినకావ్యములే శాశ్వతములై అన్ని తరముల సహృదయపరంపర కానందము కల్గచేయుచున్నవి. మహాభారత, భాగవత రామాయణాదులును, హోమరు, డాంటీల రచనలును, కాళిదాసు, షేక్స్పియరు మొదలైన మహాకవి రచనలును, ఇంతయేల, "Classics" అను పేరును పొందుచున్న సమస్త సాహిత్యమును ఇట్టిదే. సహృదయత్వము పఠిత యొక్క విజ్ఞానముపై నాధారపడియుండును. అది నిరంతర కావ్యానుశీలనముచేతనే లభ్యము. ఆ యనుశీలనము సహృదయుని మనోముకురమును శుభ్రముచేసి చదివెడి కావ్యములో పఠితని తన్మయునొనర్చును ఈ తన్మయీభవన యోగ్యత లేక నేను సహృదయుడ ననుకొనుట అహంకారమే కాగలదు

కావ్యమునకు ప్రయోజనము ఆనంద మొక్కటియే యనుకొనరాదు "కావ్యం యశసే, అర్థకృతే, వ్యవహారవిదే, శివేతరక్షతయే, సద్యఃపర నిర్వృతయే, కాంతాసమ్మిత తయోపదేశయుజే" పై వాక్యములోని తుది రెండును గ్రహింతము అట్లు గ్రహించిన ఆనందోపదేశములు రెండును కావ్యప్రయోజనములని తేలు చున్నది కాని ఈ ప్రయోజన మనునది ప్రచారమునకు దిగిన యెడల సార్వ కాలీనత కొరవడి కావ్యత్వమునకు లోటు కలుగవచ్చును. భిన్నభిన్న సందర్భము

లలో సాహిత్యమును గూర్చి భిన్నాభిప్రాయముల నిచ్చిన ఆస్కార్‌వైల్డ్ కూడ మానవ జీవితమనిన నేమియో అర్థమైన పరిణత దశలో "The value of art is not beauty but right action" అనినాడు మనము పై రెంటిని సాహిత్య ప్రయోజనములుగానే గ్రహించినాము

ఇప్పు డభ్యుదయవాదమనునది వ్యాపించియున్నది. అభ్యుదయమనిన నేమో, దాని లక్షణము లెవ్వియో పూర్తిగా తెలియజేయు రచనలు బహు స్వల్పముగా నున్నవని అభ్యుదయవాదులే యందురు సుప్రసిద్ధ అభ్యుదయ రచయిత యైన సాహిత్య శిరోమణి నాగభైరవ శివరామకృష్ణయ్యగారు తత్సాహిత్య స్వరూపము నీ క్రింది విధముగా తెల్పియున్నారు "పద్యలక్షణాన్ని గాని, కావ్యలక్షణాన్నిగాని, రసపుష్టినిగాని, విసర్జించి యథేచ్ఛగా కావ్యరచన కొనసాగించమని నా ఆశయం కాదు లక్షణాలూ, నియమాలూ పూర్వకాలాన్నించీ మనదేశంలో వున్నవే · కాని భాషలోనూ, భావాల్లోనూ, రచన పద్ధతిలోనూ మాత్రమే నూతన పంథా—అభ్యుదయ పంథాను అనుసరించమని నా విన్నపము" "నిరక్షరాస్యులైన సామాన్య ప్రజలకు కూడా సాకల్యంగా తెలియజేయాలంటే, సంస్కృత భూయిష్ఠమైన కవిత్వం, సమాసాలు, మొదలైన పాండిత్య ప్రదర్శను వ్యక్తపరిచే విధానం పనికిరాదు సులభంగా పామరజనులకు సహితము అర్థమయ్యే భాషలో వ్రాయబడి ఉండాలి. ఉంటే సరళభాషలో, చిన్నపదాలలో అధికమైన భావ మిమిడ్చి సామాన్య ప్రజా ఉద్యమానికి, సామాన్యప్రజాభివృద్ధికి, అవసరమయ్యే కవిత్వాన్నే కవితల్లజులంతావ్రాయాలి, సర్వజనులకు తెలిసే వ్యావహారికభాషలో సమాసరహితమైన శైలియు, గానాని కనుకూలమైన గేయాల్లో, ప్రజలకు కర్తవ్యజ్ఞానం విషయవివేచనం బోధించే పద్ధతిలో కవిత్వ ముండాలి దీనినే అభ్యుదయ రచన అనండి" ఈ అభ్యుదయ వాదమునకంతకు మార్క్సు ప్రవక్త. ఆయన సంపదమాత్రమేకాక వాఙ్మయము కూడ బహుళజనప్రాప్తము కావలెనని తెల్పెను సారాంశమే మన ప్రజానీకము నకు సులభముగా తెలిసి, దేశాభ్యుదయమునకు తోడ్పడుచు, ప్రజలయొక్క కష్ట నిష్ఠురములను చిత్రించుచు, భావి ప్రజాభ్యుదయమునకు మార్గమును చూపు రచన అభ్యుదయరచన యని తేలుచున్నది. పై అనుపాదమునుబట్టి అభ్యుదయవాదులు

కూడ ఉపదేశముతోపాటు ఆనందమును కావ్యప్రయోజనముగా విశ్వసించుచున్నట్లు స్పష్టమగుచున్నది. సంఘశ్రేయస్సే కవుల పరమావధి ఈ విషయముకూడ మన పూర్వులు స్పష్టముగా తెల్పియున్నారు "విశ్వశ్రేయః కావ్యం" అని నన్నయ భట్టారకు డనినప్పుడు విశ్వశ్రేయస్సును అభ్యుదయముతో ఏకీభవింప చేయవచ్చునని నా మనవి ఇప్పుడు వ్రాయబడుచున్న అభ్యుదయరచనలు పై నిర్వచనమును గమనించుచున్నవా యనునది మరియొక ప్రశ్న కొందరి కొన్ని రచనలు విజ్ఞానియైన సహృదయునకే శ్రమ కల్గించుచున్నవి అభ్యుదయముకంటె శ్రేయస్సనిననే అర్థవంతమగును

కవి ఉద్దేశించిన పైరెండు ప్రయోజనములను సాధించుమార్గములు రెండు, "పరిణామము, వివర్తము" అని. వేదాంతమునకు సంబంధించిన ఈ వాదములు సాహిత్యమున కెట్లు వర్తించునని అనవచ్చును కవి తా నివ్వదలచిన సందేశమును లేక ఉపదేశమును సూటిగా కార్యకారణ భావముతో రమణీయముగా తెల్పునపుడు అట్టి విధానమును పరిణామ మనవచ్చును అట్లుగాక తాను చెప్పదలచిన విషయమును ప్రస్తుతపరిస్థితులపై జుగుప్స కలిగించి తద్వారా భావి కర్తవ్యము నుపదేశించు మార్గమును వివర్తమన వచ్చును. నేటి అభ్యుదయరచనలను పరీక్షించిన వారి రచనలలో బహుంశముగ నీ రెండవ మార్గము గోచరించును. ఉభయవాదులును మాదియే మార్గమని వాదించుట సరికాదు. మరియు నీ అభ్యుదయమనునది సార్వకాలీనము కాదు. నిన్నటి యభ్యుదయము రేపటికి ప్రాతకావచ్చును. అభ్యుదయ మనవస్థ కావున వారనుసరించు మార్గములలోకూడ కొంత అనవస్థయుండును. ఒక కాటకము వచ్చినదనుకొనుడు. తత్కాలపు పరిస్థితులను ప్రజానీకముయొక్క మనస్సులలో నాటుటకై జుగుప్సాకరముగా వర్ణించిన కావ్యము అవగ్రహము వెదలి సంపద మరలివచ్చిన కాలమున ననుపయుక్తము కావచ్చును. మరియు నభ్యుదయ మనంతముఖము దీని కెల్లలను కల్పింపజాలము

కావ్యమునకు వస్తువు ఎట్టిది యుండవలెను అని కోల్రిడ్జి ఈ సందర్భమున "కావ్యవస్తువును" "Poetic thoughts and thoughts translated in to the language of poetry" అని రెండువిధములుగా భావించినాడు. మొదటిరకపు వస్తువు

సార్వకాలీనము రెండవరకపు వస్తువు సార్వకాలీనము కాకపోయినను కవి తన భావనాశక్తిచే ఉదాత్తముచేసి దానికి సార్వకాలీనత కల్పింపగలడు ఆకలితృప్తులు అన్యోన్యాభావముతో వరలును. ఒకటి యున్నప్పుడు రెండవది యుండదు. ఐనను కవి వాటిని సందర్భోచితములుగా భావించి వాటికి సార్వకాలీనత్వము కల్పించ గలడు. భవానీభట్టాచార్య రచితమైన "ఆకలి" యను నవలయే యిందులకు తార్కాణము. విష్ణుమాయా నాటకమున రాధామాధవ కవి చేసిన యవగ్రహవర్ణన మట్టిది. ఇట్టి దృష్టాంతము లెన్నెని కలవు వస్తువును గూర్చి. అది ఎట్టిదైనను విప్రతిపత్తి లేదు. కాని దానిని సార్వకాలీనము చేయు భావనాశక్తి కవికి యుండ వలెను. క్రాంతివాదులొక విషయమును గమనింపవలెను క్రాంతి సార్వకాలీనము కాదు సాహిత్యము క్రాంతిశాంతికాలముల రెండింటికిని తగినట్లుండవలెను. ఈగుణమునే సార్వకాలీనతయని పైన నిర్వచించినది

ప్రకృతి వైవిధ్యవిలసిత. మానవుడో కన్పించుచున్న వస్తువులతో తనకు నచ్చినవాని నేరుకొనువాడు అనగా అతనిది వరణపద్ధతి. ఈ ఏరుకొనుట అతని చిత్తవృత్తినిబట్టియు, భావననుబట్టియు, కళాదృష్టినిబట్టియు నుండును తన నాక ర్షించిన వస్తుజాలమును గూర్చియే యతడాలోచించుచుండును. కవియు మానవుడే గాన నిదియంతయు నతనికికూడవర్తించును. కాని కవి క్రాంతదర్శి ఇతరులకందని స్థానము లతనికందును ఈ యర్థమే "రవి కాననిచో కవి కాంచునే కదా" యను నానుడి యందిమిడియున్నది విషయమిట్లుండ "వస్తువిట్టిదే యుండవలెను" అని కవిని శాసించుట కధికార మెవ్వరికి గలదు? కనుక "నిరంకుశాః కవయః" అని పెద్దలందురు.

కవితాసామగ్రి యైన భావవస్తురచనలలో నొక్కొక్కదానికి సహృదయుని నానందింపచేయు శక్తి కలదు. కాలమునుబట్టి వీనిలో నొక్కొక్కదానికి ప్రాచుర్య ముండును ఒక కాలమున నుండి మరియొక కాలపు పరిస్థితులను చిత్రించినపుడు వెనుకటి కాలపు వాతావరణమున కవి ప్రవేశించి చిత్రింపనగును మరియు ప్రతి కాలమునందును పై మూటి ప్రాచుర్యము కొంచెమో గొప్పయో ఉండనే యుండును ప్రజానీకము యొక్క రుచి సర్వదా ఒక విధముగ నుండదు ఇచ్చట నొక

సమస్య కలదు "ప్రజానీకము విజ్ఞానవంతమై, కవిని గ్రహింపవలెనా, లేక కవి తాను ప్రజల కిందుబాటులోనికి దిగిపోయి వర్తించవలెనా" అనునది కవి ప్రవక్త. అతనినొకప్పుడు చుట్టునున్నవా రర్థముచేసుకొనక పోవచ్చును క్రీస్తు నర్థము చేసుకొనక ప్రజ హింసించలేదా ? ఏ కవి రచన యైనను ప్రజానీకమున కంతకును అర్థమగుట యసంభవము అభ్యుదయ కవులందరి రచనల ట్లర్థమగుచున్నవా ? సహృదయత్వములో తారతమ్యమున్నట్లే రచనలలో కూడ తారతమ్యముండును సుఖకాలమున నున్న చిత్తవృత్తి దుఃఖకాలమున నుండదు అందుచే నొక కాలమున చేయబడి నిలిచిపోయిన రచనను తిరస్కరింతుమా? పైసామగ్రిలో రచనకు ప్రాముఖ్య మెక్కువగా నిచ్చిన కాలమునందలి రచనలు కూడ నుపాదేయములె యగును. నేటి కాలపు వాతావరణమును బట్టి ఎప్పుడో వ్రాసిన రచనలను పరీక్షించుట తగనిపని. నేడు అభ్యుదయవాదులు వస్తువున కెక్కువ ప్రాముఖ్య మిచ్చువారుగా కనపడుచున్నారు వారిలో కొందరు రచనకు కూడ స్థానమిచ్చుచున్నారు. వారిని "రీతి" వాదు లనవచ్చును. అందులకు "భావ" వాదులు నిరసింపజెల్లునా ?

ప్రపంచమునందలి సాహిత్యము పర్యాలోకించిన విద్యా విజ్ఞానము లభివృద్ధి యగుకొలది సాహిత్య ప్రక్రియలును మార్పుచెందుచుండిన ట్లగపడును ఒకే ప్రక్రియ శాశ్వతముగా నుండజాలదు. ఇవి చక్రనేమి క్రమముగా నొకదానివెనుక నొకటి వచ్చుచుండును మన సాహిత్యమునే తీసుకొందము. మొదటిది భాషాంతరీకరణ యుగము ఉదాత్తములై శ్రేష్ఠములైన కావ్యములు భాషలో వెలసెను. అవి యిప్పటికిని శిరోధార్యములుగానేయున్నవి కొంతకాల మీరీతుతే యనుకరణీయములయ్యెను. తరువాత ప్రబంధము వచ్చెను అదియును గతానుగతికమగుట నూతన ప్రక్రియాన్వేషణ మవసరమయ్యెను ఇంతలో పాశ్చాత్యభాషాసంపర్కము సాహితీపరుల చిత్తవృత్తులను మార్చెను. కాల్పనిక యుగమవతరించెను దానిమీద కూడ తిరుగుబాటు వచ్చెను. మధ్య నెన్నియో "ఇజములు" తలలెత్తి యంతరించి తుద కిప్పు డభ్యుదయ ప్రక్రియ నిలచియున్నది. ఇదియు మారుసూచనలు పొడకట్టుచున్నవి మరల చక్రమువెనుకకు తిరుగివచ్చును నియోక్లాసిసిజముయొక్క ఛాయలు పడుచున్నవి ఇట్లు మార్పు సహజమై యుండగా ఒక్కొక్క రచయిత

తానేదో పొడిచి గెలచినట్లును నశించుదాని నుద్ధరించినట్లును అనుకొనుట కొంతవర కాత్మవంచనగ అగపడును చారిత్రికదృష్టితో చూచుట యవసరము.

మనమెన్ని సూత్రములు నిర్వచించినను కాలపురుషుడు విలువలను కల్పించు చుండును ఆయన గొప్ప "బోల్షెవిస్టు". నిమ్నోన్నతములను సరిచేయుట, అవసర మైనచో కల్పించుట యాయన పని ప్రపంచమునందలి సాహిత్యములలో నెన్ని గ్రంథములు నశించలేదు ? ఇప్పు డున్నవానిలో నెన్ని నిలచును ? ఇది యంతయు కాలమే తీర్చును మానవు డహంకారంపడి ప్రయోజనము లేదు కాలపురుషుని ధర్మములలో వెనుక మనవిచేసిన సార్వకాలీనత యొకటి. మన సాహిత్యమున నొక శతాబ్దచరిత్రను సింహావలోకనము జేసిన నెందరు కవులు యెన్ని గ్రంథములు కాలగర్భములో లీనమైనవో తెలియును కావున నిప్పుడు బహుళప్రచారములో నుండుట సార్వజనీనతకు దృష్టాంతము కాదు కాలపురుషుని పరీక్ష కాగవలెను

ఇక నీ ప్రకృత గ్రంథమునుగూర్చి కొంచెము ఇందు దాదాపు అర్ధశతాబ్ది నాటి కవులనుండి యత్యంతాధునికులవరకు నున్నారు ఈ కాలమునకు సంబంధిం చిన యన్ని ప్రక్రియలు నిందు కలవు శ్రీ శివశంకరస్వామివారి "అభ్యుద యము"తో ఈ గ్రంథము నారంభించితిమి

ఇందలి కావ్యములలోని వస్తువు వివిధము కవికుమారులు తమ రచనలలో ఉత్తమములని తామనుకొనినవి మా కందించినారు మా నవ్యసాహితీసమితి చేయు చున్న సాహిత్యకృషికి ఈ సంచిక ఉపలక్షకము తా మెన్నుకొనిన వస్తువులను తమ దృక్పథమునుండి కవికుమారులు ప్రస్తరించిరి ఇందు వారి వివిధ భావములు వ్యక్తమగుచున్నవి. గత నలుబది సంవత్సరములలో సాహిత్యమునందలి భాషా భావములలో నెట్టి మార్పులు వచ్చెనో అవియన్నియు దాదాపు దీన ప్రతిబింబించు చున్నవి ఈ మార్పులకు మూలపురుషులలో శ్రీ శివశంకరస్వామి ముఖ్యులు. సాహితీ సమితిని స్థాపించి, దానిని వ్యావహారిక భాషాప్రచారమునకు వినియోగించి ఆదివరలో నజ్ఞాతులగు ననేక యువకులను కవికుమారులుగా రూపొందించి, అప్పటినుండి ఇప్పటివరకు నవ్యసాహితీ సాధన చేయుచున్న శ్రీ స్వామివారి తోడ్పాటు మాకు మిక్కిలి ప్రోత్సాహకమైనది పైన ఉల్లేఖించిన మార్పులలో

వ్యావహారిక భాష, పద్యమునకంటె గేయమునకు ప్రాముఖ్యమిచ్చుట. వృత్తములలో రెండు పాదములనే వ్రాయుట, అంత్యనియమము. వృత్తములను పాదములుగాగాక అర్థమునుబట్టి విభజించుట, అసమ పాదగేయ రచన మొదలైన ఎన్నిటినో ఇందు చూడవచ్చును ఇంతియేగాక అత్యాధునికు లాదరించుచున్న రీతులు కూడ ఇందు గలవు. ఆధునికులకు మిక్కిలి ప్రియమగు సంప్రదాయ నిరసనము, అసంతృప్తి నిరాశ మొదలైనవికూడ ఇందు కనవడును. ఒకేవస్తువును గూర్చిన వివిధ దృక్పథములు కూడ ఇందు కాననగును అభ్యుదయ రచయితలలో భగవద్గీతలోని యోగములకు క్రొత్తయోగమును కల్పి సందేశము నిచ్చిన వారును, భవిష్యత్తు ఆకాశమేననినవారును, ఈ జన్మమే నిజమనువారును కలరు భావుకులు సందేష్టలు, మార్గదర్శులు, శృంఖలాబద్ధులై వానిని త్రెంచివేయ సమకట్టినవారు మొదలుగా వివిధ రచయితలు యిందు పాల్గొనినారు ఇందు కవికుమారులు వారికిష్టమైన భాషను వాడిరి తుదకు సాహిత్యమంతయు ఒక గదులవరుస కాక ధారావాహికముగా ప్రవహించు నొక జీవనదియనియు, అంతులేకుండ ప్రాకులతయనియు భావించిన గేయముతో నీసంకలనము ముగియుచున్నది. మేము కాంక్షించిన అభ్యుదయము తీగవలె ప్రాకి ఆంధ్ర సాహిత్యమునకు శోభ చేకూర్చుగాక ఇక శ్రీ రాధాకృష్ణపండితుని ఈ క్రింది వాక్యములతో ముగింతుము.

"At the heart of all great literature there was a vision, an illumination, a perception of what endures and its bearing on the actual world True literary men aimed at purity of thought and to get beyond the vagaries of fashion and the fluctuations of taste The perception of the enduring behind the transient was possible only for those who underwent rigorous discipline—Sadhana "

పోతుకూచి సాంబశివరావు
ప్రధాన కార్యదర్శి.

పుట్టపర్తి సీతారామయ్య
అధ్యక్షుడు.

## అభ్యుదయము

స్వర్ణవాహినిలోన స్నపిత మైనవిధాన
ధరణీ ధరాగ్రముల్ తనరారు చున్నయవి.
ఆమూలచూడముగ నవనీరుహశ్రేణి
పల్లవించిన రీతి భాసిల్లు చున్నయది.
కౌసుంభ రాగాంశుకమ్ము తాల్చినయట్లు
వెల్గుచున్నది కృష్ణవేణీ మహాదేవి
దివ్య దేహాలతో తేజరిలుచున్నారు
శాద్వలస్థలముపై సంచరించెడి జనుల్
ఉత్సాహవివశమై ఉప్పరంబున బోవు
ఖగకులారావముల్ కర్ణోత్సవము చేయు.
మందమందమ్ముగా మలసి యంగము లంటి
పవనాంకురావళుల్ పారవశ్యము గొల్పు.
ఇది విజయ వాటికా, ఏ దుఃఖములు లేక
ఆనందతుందిలం బగు స్వర్గవాటికా!
ఈప్రభాతమువేళ నేవైపు కనుగొన్న
నవ్యసృష్టివిధాన నాకన్నులకు దోచు!

— శివశంకరస్వామి.

## అలంకరణ

అదిగో! అదిగో! ఆ గదిలో!
ఇదిగో! ఇదిగో! ఈ హృదిలో!

శ్రీరవి దీపం పెట్టుకొన్నదీ
చీకటి తెరలను కట్టుకొన్నదీ
తమ్మి పీటపై కూరుచున్నదీ
తనలో నీడలు చూచుకొన్నదీ ॥అ॥

నీలాకాశం దువ్వుకొన్నదీ
లీలాతారలు తురుముకొన్నదీ
మబ్బు కాటుకను దిద్దుకొన్నదీ
మండిన మెరుపులు రుద్దుకొన్నదీ ॥అ॥

చెందురు బొట్టును పెట్టుకొన్నదీ
చెవులకు సరిగమ లుంచుకొన్నదీ
ముక్కున పడిగలు గుచ్చుకొన్నదీ
మోవిని అమృతం నించుకొన్నదీ ॥అ॥

తొలకరి వన్నెలు తాల్చుకొన్నదీ
తుమ్మెద గజ్జెలు కట్టుకొన్నదీ
వెన్నెల చీరను విచ్చుకొన్నదీ
వెన్నపూసలా వెల్గుచున్నదీ ॥అ॥

పాలవెల్లి విల్లందుకొన్నదీ
పాశుపతమ్మై రివ్వుమన్నదీ
మమతా రమతలు చిందుకొన్నదీ
మాధురులను పండ్శించు చున్నదీ ॥అ॥

వసంతరాగం దిగంతాలలో
దిసంతులాడగ చిమ్ముకొన్నదీ
శరత్ప్రవాహం జగజ్జీవమై
స్ఫురించ ముద్దులు కురుస్తున్నదీ ॥అ॥

రాత్రిం దివాలు, దివులూ, భువులూ
రాగ దిగ్ధలై, రసాభోగలై
బృందనాట్యరుచు లందిపుచ్చుకొన
ధిందిమితా పదము లిడుచున్నదీ ॥అ॥

— భీమన్న

## ఆమె

తరుణి కనుదోయి నా కనులారయ బుట్టు
మన్మథాగ్నిచ్ఛటా దగ్ధ మదనమూ_ర్తి
ఈ శరీరము కించి త్కృపాశరాంబు
సేచనతై_వ్రక శీతల స్నిగ్ధ మరయ!

కలికిమూ_ర్తిని గని అహంకార మొదవ
తాను వమ్మయి ఆ యింతి తనువు చేరె
పంచసాయక సహితుడై పంచరతిని
వంచనము చేసి కాబోలు పంచశరుడు.

ఆ మృదురూప వైభవము
నందలి శోభకు డెంద మిందునం
దే మధుమూర్తులం గొనని
యింతికి బానిస, చూపు తా సతీ
ధామపు బంది, దేహమిక
తర్పణ తద్రమణీయ మూర్తికిన్
క్షేమ విచారముల్ సకియ
చేయు విలాసపు చేత లూతగా.

చూచితి నొక్కమారు,
నది చూచెను, చూచిన చూపు తీపిలో
సూచన మాత్ర ప్రేమ రస
సూక్తి వెలార్చెను మానసంబు లా
లోచన లోచనంబు మరి
లోగొన దొండొక నిత్యమార్గ మ
బ్బా, చన వీయకూడదు
లతాంగులకుం గడు పేర్మి నోర్మితోన్.

ధరణి దివమౌను, జనులు కథానుసరణి
దివిజులౌదురు తరుణాంగి దేవలోక
రాణియౌ, మరి నేను త ద్రాజరూప
విభవ మందియు నేలుదు విశ్వములను.

అసమ రూపపు శృంగార కుసుమ మీవు
అమలకాంతుల బంగారు కమల మీవు
అకలుషంబగు సద్గుణ మకుట మీవు
అబల, ముద్దుల ముత్యాల సొబగు వీవు

నిద్దురచెందు మానసము
నీ విమలాంగ కళా ప్రపంచపుఞ్
మిద్దెల లోన శాంతమున
మేల్కొని కాంచెద నీదు సౌరు, నా
ముద్దులరాణి కోమలపు
మొల్కవు చిల్కల పల్కు నీది, సొం
పద్దిర ! చెప్పజాల
కవితాన్వయశక్యము కాదు మేదినిన్.

— భద్రిరాజు

## కుసుమము

కుసుమ మొక్కటి గంటి కోమలీ ! నేను
బంగారు రేకుల రంగారు దాని
పరువంపు నెత్తావి మురిపించు దాని
వెల్లివారెడి తేనె వినువాక దాని
కుసుమ మొక్కటి గంటి కోమలీ ! నేను

అది గభీరమ్మును
అది మధురమును
అది అపురూపము
అది అపూర్వమును

అది అందరానిదై ఆడించుచున్నదే
ఊరించుచున్నదే ఉడికించుచున్నదే
కుసుమ మొక్కటి గంటి కోమలీ! నేను
కంటిలో పాపయై కదలకున్నదియె.

కునికితే కుసుమమే
కనుదెఱవ కుసుమమే
తలపులో కుసుమమే
మెలపులో కుసుమమే

ఊరించుచున్నదే ఉడికించుచున్నదే
కంటిలో పాపయై కదలకున్నదియె.

రేకలో రేకనై ఏకమయినట్లు
పూదేనె సోనలో పులకించినట్లు
పూరేకు రంగులో పొంగారినట్లు
నెత్తావి మరులులో నిదురించినట్లు

అది కలయొ మెలకువయొ
అది కునుకొ అది యేమొ
ఏమిటో ఏమిటో
ఎఱుక కందని తీరు !

రేకులో రేకునై యేకమైపోతి
నేను కనుపడలేదు
నేను వినబడలేదు
కుసుమమే కనిపించె
కుసుమమే కుసుమమే
ఎదుట, ప్రక్కల, పైని
ఎచట నేమియు లేదు
కుసుమమే కుసుమమే
పరువమే పరువమే
వలపులే వలపులే-
ఏమిటో ఏమిటో !

— శ్రీనివాస సోదరులు

## కృష్ణవేణి

ఈ యాషాఢ నవాంబుదార్భటులతో
　　　నేకశ్రుతిం గల్పి త
ల్లీ, యీ రీతిగ నిత్యయౌవన సుధా
　　　శ్రీరాగ మాలాపనల్
చేయం జాలితి వెన్నిమారు లిటులన్
　　　జీర్ణించు నా బోంట్లకున్
ప్రాయం బింత చిగుర్ప నేరితివె
　　　అంబా ! కృష్ణవేణీ నదీ !

నిన్నా మొన్నటి దాక ఎండ బడి
　　　యెంతే జాలిగా జాలుగా
నున్నా వోపిక లేక నాకు వలెనే,
　　　ఒక్కుమ్మడిన్ నేడు సం
పన్నాత్మీయ మహా ప్రవాహమున
　　　సివ్వా లాడుచున్నావు నే
ని స్నీనాడును పోలి పొంగ గల
　　　నంటే, తల్లి, కృష్ణాపగా !

నీ కూలంకష వాః ప్రపూరమున
　　నెన్నే బిందువుల్ కల్గునో
నీ కన్నేళ్ళ వయస్సు లేదటవె,
　　పీనిం జూడు షట్త్రింశకున్,
వాకల్ కట్టుచు పొంగి పొంగి మరలన్
　　వర్షంబు వర్షంబునన్
నీ కౌమారము వాడెదే, ఇతడొ
　　క్షీణించెం గదే అప్పుడే !

నీ కల్లోల కరాబ్జ సంతతుల
　　మేనిం దాకవే చల్లగా
నా కాయం బిది ముంచి తేల్పవె
　　త్వదంభశ్శీకరాసార ధా
రా కేలిన్ తనియింపవే శ్రవణముల్
　　గాంధర్వ సంపత్తిచే
నా కౌమార మిగుర్చి నిల్పగదె
　　కృష్ణామాత ! జన్మాంతమున్

— నోరి నరసింహశాస్త్రి

## చిత్త కుబ్జ

ఎన్ని మార్గముల న్నిరంతర
మెంత సాధన చేయుచున్నను
పోవకున్నది వక్రగమనము
బుద్ధియం దుండి !

కుబ్జ నీ వొకసారి ప్రీతిని
గ్రుచ్చి కౌగిట జేర్చినంతనె
వదలిపోయిన దంట ఆయమ
వక్రిమము కృష్ణా !

ఎల్లవేళల యందు నీకై
యెదురుచూచుచు నున్న, దెపు డీ
చిత్తకుబ్జను నీ కవుంగిట
జేర్తువో కృష్ణా !

— శివశంకరస్వామి.

ప్రగతి

చొరవెట్లబ్బును నాకు లోకమున?
　　అశ్రుస్నిగ్ధ నేత్రాలలో
దరహాసమ్ములు నిల్పి మోమున
　　విషాదచ్ఛాయ మాయించి న
గ్గురిలో నవ్వుచునుండినన్ హృదయ
　　కల్లోలమ్ము దాగదే
నరకం బంతయుఁ దెచ్చి నా బ్రతుకులోనన్
　　దాచినావా ప్రభూ!

★ ★ ★

నను బడలింప నేమిటికి ?
నా నలువైపుల దుమ్మురేఁపి యీ
కనులను గప్పరాదె కొఱ
గాములఁ బోవుటకన్న శ్రేయమౌ
పని యొకవైప—? నా చనెడు
బాటయు నింకొక వైప—? లాఁగు నా
మన మొకవైప—? ఏ దరికి
మళ్ళుదు నెచ్చటికంపు వెళ్ళుదున్ ?

★ ★ ★

శక్తిహీనత్వమందున శాంతి లేదు
కర్మహీనతయందు మంగళము లేదు
కలము కాగితమో పాఱ పలుగో తెమ్ము
దేవి! లేలెమ్ము నాకుఁ బాధేయ మిమ్ము.

— ఉత్పల

## మురళి

మురళీ ! ఎంతటి ధన్యురాలవో కదే
ముద్దాడి ముద్దాడి నిన్
సరసీజాక్షుడె సత్కరింప, రసముల్
జాల్వార, లోకమ్ములన్
మరవం జేయగ జాలు నైపుణియు
సామర్థ్యంబు నీ కబ్బె నే
కరణిం దెల్పుచు ముగ్ధచిత్తమునకున్
కల్యాణముం గూర్పవే !

నాది యటంచు లేశము మనమ్మున
భేదము లేదు, సర్వమున్
నీది యటంచు మాధవు కనీనికలం
బులకించి, మోవిపై

చేది సుధారసంబుల వశీకర
 ణైక విశిష్టమంత్రమున్
ఊదెద వెట్లు చిత్తమున నుజ్జ్వల
 రాగము లుల్లసిల్లగన్.

ఎచ్చటనో గృహంబున తపించి
 తపించు నెడంద దూరి నీ
ముచ్చట చూపు వేడుక నిమేషము
 లోనసె అర్ధరాత్రమున్
రచ్చల కీడ్చి తెత్తువవురా!
 మరియాదల విస్మరించు నీ
యిచ్చల మచ్చలం గడుగు శెట్టులు
 రాగ సుధా తరంగముల్?

గాలిని దేలి వచ్చి చెలికారపు లోతు
 లెరుంగ గుండె ధా
రాళముగా నొనర్చి రసరంజిత
 రాగ మరంద వృష్టిలో

సోలగ జేయుచున్ ప్రణయ సూక్తులతో
గికురించి పోవు నీ
కేళికి నోడి నిల్చితి వికీర్ణ విషాద
విలాసమూర్తినై.

ఆతడు దేని పాడిన అదంత
పదింతలు చేసి యేటికే
చేతము లాహరింతువు, వచింపుము,
సూర్య సుతా స్రవంతికా
పూత జలంబులన్ వలపు పూతలు
పూయు సమీర బాలు సం
గాతపు నెయ్యతియ్యముల గాథల
బాధలు రేపె దేలనో!

నీ వలెనె నేను గూడ నా జీవితంబు
విభుని హస్తాల కర్పించు వేణు వగుచు
రాగ మకరందముల్ నింప రక్తి కలదు
చెప్పవే యే వ్రతంబులు చేయవలెనొ!

— వసంతకుమారి.

# యుగే యుగే

నేను

ఇది నా కవిత్వం-గీత; వినేవాడు నరుడు
చదువూ సంధ్యలు రాని రోడ్డుమీద పామరుడు
లేమి తల్లి యొడిలో నిరంతర గాఢ నిద్రాపరుడు.

ఆకలితో నిషాదుడేసిన ములుకు బాధ
ప్రాణ ప్రతిష్ఠచేసిన శోకపు పలుకు గాధ
ఎదలో జాలి నదిగా పొంగిన రచనా ప్రథమ వేధను

అవలీలగా విభజించి నాలుగు వేదాల
భువి జనమ్ములలో, అన్నదమ్ములలో భేదాల
ఫలితం రణమనీ, ఘోర మారణమనీ బోధించు
ఇలకొరకునైన తగవుల కథల కూర్పరిని.
పలుకు పలుకున ధర్మము చిలుకు నేర్పరిని.

నే నాకాశంలో రవిని
ఆ కాలంలో భారవిని

చెవులెత్తి విను నరుని తలపుల ఆలమందలకు చక్కిలిగింతగా
అడివి మూలమూలల త్రవ్వియెత్తిన అందము పుక్కిలింతగా
వేణు బోధ లూదిన భువనమోహన గీతాశీలుణ్ణి
కాను బాలుణ్ణి
గోవర్ధనగిరి ఎత్తిన గోపాలుణ్ణి.

భూలోకపు రౌరవ కౌఢవ పాలన సాగిన విశాల పరిధిలో
హాలాహల జన్మహేతువైన యీ బ్రతుకుశ్రమల వారిధిలో
కోటికోట్ల నరులకు దినదినం పెరిగే వగే
ఈ నా అవతారానికి పరమకారణం
శ్రద్ధగా వినవోయి నరుడా!
నేను- సంభవామి యుగే యుగే.

విశ్వరూపం

మతి చెడిపోయిన దేహంతో - సందేహంతో
నరాలు గడగడ వణికే నరుడా - పామరుడా!
అదుగో అటు చూడు నా రూపం
విశ్వం తానై పొంగిన ఆటోపం!

నరుడు పడే బాధలలో
అవమానపు గాథలలో
అలసటలో ఆందోళనలో
పొంగిన కోట్లాది బానిస మహాజన సముద్రపు పోటులో
తిరుగుబాటులో
ఏ ఏటేటా పీడించే పన్నుల్లో
వరి వెన్నుల్లో
కొండల లోయల్లో పెరిగే గోధుమపంట పొలంలో
ఏటి కేడు సన్నగిలిన హలంలో

ఆకలితో నిలువున నీరైన దరిద్రుల అరుపుల్లో
వీరుడు శత్రువుపై విసిరిన వడిసెల మెరుపుల్లో
వటవృక్షం కొమ్మలమీద ఎండాకుల గలగలలో
తరువు క్రింది నిర్వాసుల లేతగుండెల సలసలలో

పట్నాల్లో మరచక్రాల అక్రమంలో
పల్లెల నిర్వక్ర పరాక్రమంలో......

సందేహం బాధించే నరుడా !
అదుగో అటు చూడు నా రూపం-
చూడలేవు మామూలు కండ్లతో
చూడు గాండివం లాంటి విండ్లతో
తుపాకి గుండ్లతో
శ్రద్ధగా వినవోయి నరుడా !
నేను- సంభవామి యుగేయుగే.

గీతాబోధ....

ముందు వెనుకలకు లాగే మనస్సు వగతో
మొగమోటం కోరలు పీకిన పగతో
నరాలు గడగడ వణికే నరుడా-పామరుడా !
యిదుగో యిటు విను నా గీతం
నరజాతికి విముక్తి సంగీతం
యిదుగో యిటు విను నా చేసిన గీతాబోధ
వదిలేందుకు నీ హృదయాంతర్గత బాధ.

నల్లని కాలం క్రమ్మిన కారుమబ్బుల ఆవరణ ఛేదించి
వెలుగు చంద్రుణ్ణి పెకలించు.

గిరిశిఖరపు టంచుల త్రోవల కడ్డంగా
కట్టిన దుర్గమ దుర్గాలు భేదించి
బ్రతుకు పరమ సత్యం శోధించు.

ముని చూపిన అజ్ఞానపు నిద్ర కన్యల మోహంలో పడకు
కనుపాపలా సత్యాన్ని జీవితం నూలుతో వడుకు.
భయపడకు చందన తరువు చుట్టిన ఉరగాల కోరలకు
వారలకు- పొన్నమాను క్రింద తీర్పులు తీర్చే
పెత్తందారులకు.

ముందుచూపు తెలివి జవంతో వర్తమాన వారిధి లంఘించి
ఆగామినాడు
జగదశోకతరువు నీడలో వెలిగే
పుడమితల్లి పొంగిన శాంతి ముద్ద చూడు.

భూమిసహా, ఆకాశంలో వ్రేలాడే సమస్త గోళాలు
ప్రతి నరుడి నరనరాలలో రక్తనాళాలు శోధించి
శాంతికి శత్రువులెవరో
కాంతికి వారసులెవరో తేల్చుకో
నువ్వెవరో పోల్చుకో!

ఆ కాలంలో అవసరమని తోచిన కులాలు
చేసిన యాగాలు, మతాల విభాగాలు
భువనం మేధస్సును జలగలాగ తొలిచిన
రకరకాల రోగాలను మాన్పు
నిర్మించు మెదడుకు క్రొత్త పూలపాన్పు.

నరుడి మనసు గుర్రం తోకను బలంగా
ఉరగం చుట్టుకున్నదానికి పలంగా
జనతామాతకు యుగయుగాలుగా కలిగిన
వినతా దాస్యం తొలగించు,
అవసరమైతే సురనాధులతో కలహించు.

శాంతి సౌందర్యాల ద్వంద్వాన్ని కావాలని చంపి
నరుడి బ్రతుకు కలలు పొంగిన ఆనందాన్ని
ముక్కలుగా చింపి
వారు సత్య ధర్మాలకు చెప్పే వక్రవ్యాఖ్యలు ఖండించు
బ్రతుకు కలల తీయని తేనెలు పండించు

యుగాని కొకటొకటిగ పెంచుతాను
గీతలో చేసిన యోగవిభాగం
కర్మ జ్ఞానాది పూర్వోక్త యోగాలకు
కలుపు నేడు జగద్విప్లవ యోగం

ఇదిగో విను, యింకొక్కటి విను
నేనే మరి తలపడితే
నా పూనికతో కలిగే ప్రళయానికి పగ్గంగా
ఆయుధాన్ని ధరించను అని కగ్గంగా
ఇరవైనాలుగు గంటలు నా సాయం
యిదుగో నీరథ చోదన వ్యవసాయం.

నీకు భయంలేదు. తుదివిజయం దక్కకపోదు
నరుడికి సూదిమొనంతరాదు
యిది అక్రమమనే వాదు.

కదులు కదులు నరుడా
కేతనీకృత వానరుడా
కదలవో నరుడా
చేతనీకృత పామరుడా
సాగించవోయి నీరథం
శాంతి శత్రువుల నిశ్శేష వధం.

శ్రద్ధగా వినవోయి నరుడా
నేను—సంభవామి యుగేయుగే.

— కుందుర్తి

## సౌందర్యపు స్వగతం

ఇది—
ఊరిబయటి
పాడుపడని శ్మశానం
ఎముకల కుప్పల ప్రాసాదం
మరణించని ప్రదేశం

ఈ—
రత్నాలరాసుల్లోని
భంగిమల భవనంలోకి
నాకోస మొచ్చావా
నే నెవర్నని ప్రశ్నిస్తావా

ఆకలిగొన్న నీకు
    నే కామాన్ని
నీ చేతుల్తో నలిపేసే
    భావాన్ని

నా జీవితపు సంధ్య
రాత్రిలో పడకముందే
వస్తానన్నావే
నందనోద్యానవనం
కీకారణ్యం కాకముందే
లేస్తానన్నావే
నాలోని విశ్వతీరాలు
మేల్కొనకముందే
పూజిస్తానన్నావే

... ...

ఇంతవరకూ, —
నా అధరంపై - నీ
గేయపు నెమరువేత —
కాళరాత్రి, హృదయకేళిలో
నే నెవర్నంటావా—
నేను—
సౌందర్యపు స్వగతాన్ని
యవ్వనపు సమాధిని —
స్త్రీ ని !

—హృషికేశ్.

# అజ్ఞాత మిత్రము

ఊహకు మీరి పోయిన వహో
　　భవదీయ విచిత్రవర్తనల్ !
సాహసవృత్తి మమ్ము విడజాలితి
　　వెంతటివాడ వద్దిరా !

వేడుక పిచ్చలింప నొకవేళ
　　నఖండిత భారతావనీ
గాఢవిలోకనాభిరతి గ్రచ్చర
　　నేగితి వాక్కా తమ్ముడా !

ఈహ మహాపగం దొడరి
　　యీదుచునుండ జలాంగనాస్వయం
గ్రాహ నిబద్ధదివ్యతమ గాత్రుడవై
　　వసియింతె నీటిలో !

చేరిన నిన్ను బట్టుకొని చెల్వొన
　　పిల్చిరొ కిన్నరాంగనల్
స్వైరవిహారలీలలను చారు
　　హిమాచల కందరమ్ములన్

హేల చెలంగ నిన్ను నెలయించెనె
కస్తురికామృగంబు నే
పాల వనాంతరమ్ములకు గాఢ
పరీమళ సన్నికర్షణన్.

ప్రాయమునన్ విరక్తిని ప్రపంచ
సుఖమ్ముల నుజ్జగించి కా
షాయము దాల్చి యల్లన ప్రచారము
చేయుదె ద్రావిడావనిన్.

ఎక్కడ నుంటివో తెలియ దేమియు
జీవముతోన నుంటివో
నిక్కము దెల్పజాలు మహనీయులు
కానగ రారు తమ్ముడా!

కుడ్య విభాసియై చెలువు గుల్కు
భవత్ప్రతిబింబ దీధితుల్
జాడ్యము నొందుటన్ మదిని సంశయ
మేచుచునున్న దెంతయున్.

కన్నులపండువై మిగుల గ్రాలెడి
తావక నాట్యసంపదల్
ఖిన్నత నొంద వాడినవి కేవలమున్
సఖి నేత్ర దీధితుల్ !

పూర్ణముగా విలీన మయిపోయిన
వన్యదురాసదమ్ములై
కర్ణరసాయనమ్ములు నఖండ
భవన్మృదు నర్మభాషణల్

తేనియతేట యైన భవదీయ
మనోజ్ఞ కవిత్వ వాహినీ
గాన వియోగదాహమున గ్రాగుచు
నున్నవి యంతరంగముల్.

కానగ వచ్చి స్వప్నముల క్రమ
భవద్వదనారవింద మ
న్యూనముగా ముదంబొసగు చున్నది
కొన్ని దినాలనుండియున్ !

—శివశంకరస్వామి

## అజ్ఞానం

ఏసు వేసుగున్న కజ్జమేకుల అంతిమశయ్య
సొాక్రటీస్ విషంత్రాగి తేల్చిన విషమ సమస్య
వాల్మీకి కదిపిన కోతుల వైరాగ్యం పుట్ట
వేమన విప్పిపారేశిన విద్యావస్త్రం.

మార్క్సు సరీలియస్, మాటర్ లిన్క్
మాంటేన్, షేక్సిపియర్, షా,
కాళిదాసు, భవభూతి, కాన్ఫూషియస్
ఎత్తిన గాజు మేడ—

మహాత్ముడు విసరిన రాయికి పగిలింది, రగిలింది సత్యం
కవికి విత్తం, కూలికి పొత్తం
అడక్క పెట్టింది నీలో మిగిలిన జ్ఞానం
అందర్నీ అడుక్కుతిన్న విజ్ఞానం—అంతిమ అజ్ఞానం,

—బుచ్చిబాబు

# ఆకలి దప్పులు

చందమామకేసి చేతులుజాచిన చంటిపాప పిలుపు, తియ్యనిది;
ఆశ్చర్యంతో పెద్దదైన కంటిపాప కాంతికి
సిగ్గుతో వంకర తిరిగిన కన్య పెదవి కమ్మనిది,

అక్కడేదో ఉందని మిడిసిపడి ఒడ్డుకెగిరి
విరిగిపడిన పిల్లకెరటంలో పగిలిన చిప్పలో
ముత్యం అందమైనది;

రాత్రి పీల్చిన మంచుతో ఆ మంచులో తొరిపిన తేనెతో
రవంత తడిసిన పరాగం చిమ్మే పుష్పం రమణీయమైనది;
అన్నిటికన్నా
చక్కెఱకన్నా, పాలకన్నా సౌరకన్యలు
త్రాగగా మిగిలిన అమృతం తీపి;

కాని,—— కానీ——
అన్నిటికన్న ఆకలి తీపి.
సూర్యుడి వేడికి విరిగిన ఉప్పు సముద్రం
వెన్నెట్లో అమృతమైతే——
కెరటం తుంపర,——నిద్రలో కలలోని కలలో
ప్రియురాలు దొంగిలించిన ముద్దులోని చక్కలిగింతైతే——
ఆనందంతో పగిలిన యోగిగుండె దైవమైతే——
నే త్రాగేవన్నీ అంతటి తియ్యనివైతే కూడా తీరదు దాహం;
లేదు, లేదు దాహంకంటె తీయని పానీయం.

ఆ చక్కెర చక్రవర్తికిపెట్టు,
ఆ తేనె రాణీ కివ్వు,
కవితా కన్యకే ఆ అమృతం,
కామించిన నియంతకే ఆ చక్కలిగింత,
యోగికి సాక్షాత్కారం దైవం,
నాకుచాలు నా ఆకలిదప్పులు

—బుచ్చిబాబు

# ఆదుకొన వస్తావు

అస్తమయ సమయాన
ఆదుకొన వస్తావు
వాత్సల్య హస్తమై
లాలింప వస్తావు
వెలుతుర్లు కనుమరుగు
వేళలో వన్నెవై
చీకటిని చాటుపడు
లోకాన చూపువై
ఆకసపు మేరకే
వెలయగా మిసిమివై
మిసిమివై పొడసూపి
వెన్నెలై విరుసుకొని
నెలవంక పొడుపువై
జ్యోత్స్నావతరణమై
అస్తమయ సమయాన
ఆదుకొన వస్తావు.

—జయంతి

## ఆదికవి

సకలామోద రసప్రవర్షిత వచ
సౌందర్య మేపారఁగా
నకలంకంబగు భావ సంపదను
కావ్యశ్రేణి సృష్టింపుచున్
ప్రకృతి గ్రంథ రహస్యశోధన కళా
పారీణులై నట్టి యా
దికవి శ్రేష్ఠుల సంస్మరించెదను
భక్తిం దొల్త, గౌరీపతీ !

గాథల్ త్రవ్వ తెలుంగువారలకుఁ
బ్రఖ్యాతంబునౌ భారతం
బా ధర్మస్థితిమూలమై నిలువఁగా
నా చంద్ర తారార్కమున్
మాధుర్యైకధురంధరాంధ్రకవితా
మర్యాదలం దెల్పు నా
మేధాశాలిని నన్నపార్యకవి
నెమ్మిం గొల్తు, గౌరీపతీ !

ప్రాతఃకాల తుషారశీకరము మైపైఁ
జింద గోదావరీ
స్నాతుండై, జప హోమ తత్పరత
నిత్యకృత్యముల్ దీర్చి సం
ప్రీతిన్ గంటముఁబూని పంచమ మహా
వేదంబు నాంధ్రాక్షర
వ్రాతంబున్ లిఖియింపఁబోలు తెలుఁగున్
వాల్మీకి, గౌరీపతీ !

చిల్లీలాకృతి సాహితీ మధురసశ్రీ
మించు దివ్యాంధ్ర వా
గ్వల్లిన్, నన్నయ, రాణ్మహేంద్రసుయశో
వల్లిన్ దమి న్నాఁటఁగా
నల్లింబిల్లిగ నవ్వి యల్లె సకలాం
ధ్రాశావకాశంబులం
దెల్లన్ హస్తవిశేష మాతనిది కాదే
యెన్న, గౌరీపతీ !

—నిడదవోలు

## ఇది జీవితం

ఈ జీవితం తొలినాటి స్థాణువు కాదు
ఈనాటి మారణ పరమాణువు కాదు,
రోజువారీ ఉదయాస్తమయాల నివేదిక
అనుకొనే వీలులేదు,
చితుకులు చేర్చి వేసుకొనే
చలికాలపు క్షణజ్వాల
పతివ్రతలకూ పుణ్యస్త్రీలకూ
లభించగల సత్రపు శయ్యాశాల.

ఈ జీవితం సరళరేఖకాదు
        వర్తుల రూపంలోనూ చుట్టుకోదు,
మాజీ మహౌన్నత్యాల
        జీమూతశ్రేణియైనా కాలేదు,
నాస్తికుడు భగవద్గీతా గ్రంథాన్ని
        ఆవిష్కరించిన ట్లూహిస్తుంది
సుస్తీగా ఉన్నవ్యక్తికి ఒలింపిక్
        క్రీడల నాయకత్వం ఆదేశిస్తుంది

ఈ జీవితం నెత్తురు చిమ్మదు
        పోసీ ఘనీభవించినట్లయినా తోచదు,
మోజుపడి సమాధుల్లో మందిరాల్లో
        నిల్చిన సంస్కృతిగానూ రూపొందదు,
ఆశల గగనంలో నిరాశల పుష్పకమెక్కి
        క్రింది సొంతనేలను చూసింది
చూసి మాసిన అతుకుల బొంతవంటి
        ఆ దృశ్యాన్ని ప్రకృతి సౌందర్య మనుకుంది.

ఈ జీవితం కేవలం నల్లపూసకాదు
మహా మేరువూ అనడంలేదు,
కాజేసిన ఆత్మకథల్లోని
ఘట్టాల ఉండకూడా కాదు,
చిత్రంగా బహిరంగ సంతాప
సభలాగా సాగిపోతుంది
పత్రికల్లోని పతాకశీర్షికవలె
వెతక్కుండానే కనిపిస్తుంది.

ఒక్కటిమాత్రం నిజం——ధరలవెంబడిపడి
యీ జీవితం పెరుగుతోంది
చిక్కవడి త్యాగ తమస్సులో
దారికై సంఘర్షణల దవాగ్ని నారాధిస్తోంది
ప్రపంచం నిద్రాణమై ఒక్క వార్తకూడాలేని
ఆఖరు క్షణం వస్తుంది
అపుడు నిలువెత్తున లేచి నిజంగా
పతాక శీర్షికై యీ జీవితం వెక్కిరిస్తుంది.

—ఆంజనేయశాస్త్రి

# ఉజ్జీవనం

౧

ఎది వసంతమొ, గ్రీష్మమొ –
ఎపుడు వచ్చునో, పోవునో – ఏమొగాని –
నేను గుర్తించలేదు యీనాటివరకు !

౨

ఇంత దుర్బలుడను – గ్రీష్మ మెట్లు వదలె ?
ఆవసంత మాడించక వదలె నెట్లు ?
ఆ శిశిరలక్ష్మి కడకంట చూడలేదు !
నిజము ! హేమంత మసలె నన్నంటలేదు ! !

౩

ఎవరికో ఆశరత్తు! ఆ వసంత మెవ్వరికిగానొ!
శిశిర హేమంతముల చూపు లెవరికొరకొ!
నాకుగా నొక్కటే - ఒక్క - వర్షఋతువు!!

౪

వచ్చు నవ్వుచు ప్రేమార్ద్ర హృదయ యగుచు
చిలిపినవ్వుల పూల ముత్యాలు కురిసి
మెరసి ఝళిపించి తడిపి నన్ ముద్దజేసి —
పిడుగుపడునట్లు ఎచటికోపోయి దాగు!!

౫

దిగులుపడి ప్రతిమకై వడి చూచుచుండ
రవళిముందుగ, ఆవెంట వర్షలక్ష్మి మందగమనము
తరువాత ప్రణయసృష్టి... !
నాకుగా నొక్కటే - ఒక్క - వర్షఋతువు!!

—చక్రవర్తి రంగస్వామి

దీపావళి

కారుచీకటులు క్రమ్మి జగమ్మున్
　　కన్నులు కానని వేళన్
దీపావళి దేదీప్యమానముగ
　　దీపించితి వీవేళన్.

ధారుణిలో గల ధర్మదీపముల
　　దాచినార లీయసురల్
అన్యాయమ్ముగ అంధకర్దమము
　　నారోపించిరి అసురల్.

నిరతము నీక్షితి నిండి వెలింగెడి
నీ దివ్యాకృతి కాంతుల్
నేడు నిరంతర నీహారావృతి
నిస్తేజము లగు నెంతో.

ధర్మచ్యుత మగు ధాత్రీస్థలి నీ
ధన్యరూప మెటు కాంతున్ ?
దీపించని బహు దీప జాలముల
దీపావళి నెటు కాంతున్ ?

ధళధళ లాడగ ధర్మఖడ్గమును
ధళిపించెద వది యెపుడో
ధర నన్యాయపు తమఃస్తోమముల
దళనము చేసెద వెపుడో !

ధర్మహీన మౌ ధాత్రీస్థలిలో
ధర్మస్థాపన మరలన్
దీపావళితో దిక్కటు లెపుడు
ద్దీపించెదవో మరలన్ !

— నోరి

# దీపాంగన

దీపశిఖ నిల్చినది పురంధ్రీ లలాట
పట్టి దీర్చిన కుంకుమ బొట్టు వోలె,
దీప శిఖ పిల్చినది, చనుదెంచినాను
తనువు తనువెల్ల ఆజ్యపాత్రమ్ము వోలె

ఎరకలు వచ్చె నా యెడద
కిప్పుడు, దీపకుమారికా భుజాం
బరమున తేలియాడెదను,
పాడెద, మంచులు పేరినట్టి ఈ
ధరణి జడత్వమూడ్చుటకు
తాపము పెంచెద, వేడిలేని ఈ
పరిసరముల్ కవోష్ణరస
—రిధిలో నెసలాడజేసెదన్.

నాకుఁ దీపశిఖాకుమారికకు
ఈనాడా! శతాబ్దాల ముం
దే కానుండెను పెండ్లి! కాని
పవనద్వేషమ్ము దీపానకుఁ
నాకుఁ మధ్య నఖాతముల్ నిలిపె;
నైనఁ దాని చేలాంచలం
బాకంపించె మదీయ శీర్షమున
ప్రేమామోద సంవాహమై.

శలభమ నైన నన్ శరభ
సామజ సింహ బలంబులిచ్చి ది
వ్వెల దొరసాని పెంచినది,
ప్రేముడితో ముడివేసి వాన గా
డ్పుల తొలిదాడినాడు నను
బ్రోచిన, దెంతటి రాగబంధమో!
చలి యనలేదు దీపక భుజా
భుజగీ పరిరంభణమ్మునన్.

బందీయయ్యె జగమ్ము దీపకళికా
ప్రత్యగ్ర బాహా యుగం
బందున్ నా యెదవోలె, అంధ తమస
వ్యాధూత కోకారిప
న్నిందా బంధుర లోకమున్ విడచి
మద్దీపాంగనాలింగనా
నంద స్యందన మెక్కి రివ్వుమనిపోనా
స్వర్గమార్గమ్ములన్!

ప్రతియింట నొక చిన్ని ప్రమిద వెల్గించిన
అవిరళ స్నేహ రాజ్యాధిరాజ్ఞి
ప్రతిగుండె నొక ప్రభాప్రతిమ నిర్మించిన
కల్పనానల్ప శృంగార ధాత్రి
ప్రతితోటలో నవప్రసవమై విచ్చిన
కాంతార కాంత వాసంత లక్ష్మి
ప్రతి మానవీ ముఖాంబరమందు ప్రాకిన
గోరోచనా చంద్ర చారు మూర్తి

దీపభామిని, ఆశాతిదీప్తకీర్తి,
మంచు కరగించి, వేడి కల్పించి, వాగ్వి
పంచి సవరించి వాయించి ప్రకృతి నెల్ల
మూర్ఛ తేరిచి చేతనాంబుధిని దేల్చె!

కాలిన రెక్కలఁ బులుగు
కైవడి నీపద కంజ సన్నిధిఁ
వ్రాలితి, నిన్ను మ్రింగుటకు
వచ్చిన గాడుపు దుండగీనితో

ఆలము నేసి గెల్పుగొను
　　నప్పుడు రెక్కలు కాలిపోయె నీ
జ్వాలలు సోకి, నీ కొరకు
　　ప్రాణములైన పణమ్ము పెట్టెదన్.

నీలో తేజము తగ్గిపోవునెడ
　　నందింతున్ కవోష్ణాస్రమున్
తైలంబట్టుల—అశ్రుధారలను
　　సంతప్తాజ్యధారం బలెన్,
జ్వాలా చేల విలోల తావక వపు
　　ర్వల్లీ విలాసంబుతో
భూలోకంబును సొంత మొక్కత్రుటి
　　సమ్మోహింపగా చేతువే!

నన్ను స్నేహము చేసికొన్నావు నీవు
వెల్గుచున్నావు నా మనఃపీఠిపైన
ప్రతి రుధిర బిందువును సమర్పణ మొనర్చి
నిన్ను వెల్గించుటకు మరణింతు నేను!

నీ కీలా పరిచుంబితంబయిన నా
స్నిగ్ధాధరోష్ఠమ్ముపై
ప్రాకెఁ గమ్మదనాలు ద్రాక్షరసమై,
ప్రత్యగ్రమాధ్వీకమై,
లోకాతీత సుఖమ్ము కూర్చినవి నీ
రోచిష్ణు బాహాయుగ
ప్రాకారాంతర జృంభమాణ లికుచా
భ స్వర్ణవక్షోజముల్.

వెలుతురు మొగ్గవై బ్రతుకు
వీధుల నూత్న పరీమళమ్ములఁ
జిలికిన నీకుగాను విర
చించితి గుండియ కొండమీద ది
వ్వెల రతనాలమేడ, పదవే
అట నుందువుగాని, కోటి గుం
డెల వెలిగింప గల్గు రమణీ!
నిను గాడుపు పాలొనర్తునే?

నీ నృతి జూచి లోకము
ఖణిల్లను గజ్జెలతో నలంపగా
బూనెను, జారిపోయినది
పో భవదంసగతాంబరాంచల
శ్రేణి, కటీ పటంబు శిధిలీ
కృతమయ్యె, వివస్త్రవైతివే
రాణి! రవీంద్రకల్పిత విలాసిని
ఊర్వశివోలె, దీపికా!

నిను కౌగింటను గొన్న నా తనువు
పోనేపోవుగానీ భవత్
తనుతేజః పరిణాహ పింజరితమీ
ధాత్రీతలంబెల్ల ఆ
త్మనుగా జేసి వసింతు సప్తజగతీ
మధ్యమ్మునన్—దీప భా
మిని ప్రేమించిన దీపమంతుడనుగా
మిన్నెక్కి క్రీడించుచున్.

—దాశరథి

## ఉడుత

ప్రీతి న్నాడు సుధా సమాన మగు
 కాఫీ గ్రోలి, ప్రత్యగ్ర సం
భూతోత్సాహముతోడ వేచితి షికార్
 షోవన్ ప్రభాతంబునన్.

స ద్దేమాత్రము చేయకుండు మృదు
 రక్షల్ తాల్చి పాదమ్ములన్
అద్దం బట్టులు నిద్దమై విశదమౌ
 నధ్వంబు బ్రాపించితిన్.

చేతోమోద మెలర్ప మారుతము
 వీచెన్ మందమందమ్ముగన్
వాతాందోళితపర్ణనిస్వనితముల్
 వ్యాపించె నల్వంకలన్.

బాలార్కారుణదీప్తి భూతలముపై
 బర్వెన్, విహంగౌఘముల్
ఆలాపింప దొడంగె మోహనముగా
 నవ్యక్త రాగంబులన్.

కొమ్మల్ కొమ్మలు తాకి దట్టముగ
న్యగ్రోధావనీజమ్ము లే
కమ్మె పచ్చని కాయమానమువలెన్
కాన్పించె త్రోవం జనన్

ఆనందంబున కొంత సేపు చనగా
నామార్గ మధ్యంబునన్
కాన న్వచ్చిరి వ్యాధబాలకులు
వీకన్ ధ్వానముల్ చేయుచున్.

ఆ రావంబుల కేమి హేతు వని నే
నచ్చోటు ప్రాపింపగా
క్రూరాకారులు మట్టుపెట్టి రొక
చిక్రోడమ్ము నొక్కుమ్మడిన్.

పోవం జొచ్చితి సాగి, కూసె విహగమ్ముల్
శ్రావ్య నాదమ్ములన్,
పూవుల్ రాలెను, గాలి వీచె, అయినన్
పోయెన్ ముదం బంతయున్!

— శివశంకరస్వామి

## ఉష

మృదుల మంజుల భాషణామృతము చిలుక
దివ్యసుకుమారి మా యుషోదేవి మోవి
తెఱచెనో లేదొ జగమెల్లఁ దేజరిల్లె
నవ్యశోభారుణారుణానంతకాంతి

మాయుషోరాణి కరుణా కుమారి ; ఆమె
యరుణ కరముల జాచి నిద్రాత్మ జగతి
మేలుకొల్పుచు వెలుఁగు నిర్మించుచుండు
నతినిగూఢ తమస్సుల నణచుచుండి.

నిత్యకళ్యాణి యామె . వినీవిధిలోనఁ
గాపురము సేయుఁ; గరుణా వికాసపధము
ఆమె నడచెడు త్రోవ; లక్షాతి లక్ష
లామె బందుగు లీ భూమియందు నెపుడు

సర్వమానవ హృదయ విస్తార భూమి
యామె లీలలు పచరించు నట్టి తావు ;
నిర్మలత్వ ముపాసనా నిష్ఠ హృదయ
శాంత విన్యాస మామె ప్రశాంతదీప్తి.

మా యుషఃకన్య ముఖకాంతి మండలమున
నీ చరాచర జగము క్రీడించుచుండు
నామె చూపెడి త్రోవయే యతిరహస్య
పథమగుచు నూతనోత్సాహ విధినిఁగూర్చు.

ఆమె క్రీఁగంటి నీడలో నరుగుచుండు
జీవకణములు నవజీవ భావనలకుఁ
బుట్టినిండ్లగు ; నామె సంపూర్ణ దృష్టి
నిలువ తులలేని క్రాంతి సంధించుకొనును.

మంజు మంజీర రంజిత మధుర రుతుల
భోగ భాగ్యాలపై నామె బుద్ధి పోదు :
శిథిల మానవజీవితాశీర్విషమ్ము
కరుణ వాక్కుల నమృతంబుగాగ నెంచు.

—జూలూరి

## ఎవరెస్టు సుందరి

చచ్చిపోయిన ప్రాతవైభవాన్ని అలా మోసుకువెళ్తున్నావెందుకు
కచ్చితంగా మాట్లాడు, వెల్లదనం చెందకు
గతం స్మశానపు కొఱవిదయ్యాల స్పష్టాస్పష్టపువెల్తురు
జతనిల్వదు. నీక్కావలసింది మందే నెత్తురు.

ఏ కన్యాకుమారినుంచో నడిచి వచ్చా వీ నెత్తం మొదటికి
సాకల్యంగా అడుగిడు భవిష్యత్తు ఎదుటికి
విశ్రాంతికై వెనక్కు చూడకు, వదలకు పట్టు, స్థైర్యంతో కాలూను
నీ శ్రమ వృథాకానీకు, భావి ఒక హైడ్రోజన్ బెలూను

నువ్వు చెప్పుకున్న గతాధ్యాయాల ప్రాతగొప్పల లిష్టు
జివ్వున ఘనీభవించి ఐంది ఎవరెస్టు
అందరినీ దరిజేర్చుకు నీముందున్న హిమానీ మార్గాగ్రం ఎక్కు
ముందైనకొాలందీ కదలదు, ఊపిరి, దిక్కు.

భయంలేదు, చలనమాగి మంచే తాననుకోకు ; సమతాభావం
జయాంకం - నీకదే ఆక్సిజన్, అదే పాథేయం
అవధార్య ! శిఖరాగ్రంమీద నిల్చుంది సర్వసమస్యా పరిష్కారిణి
భవితవ్యతా ధౌతాంబరధారిణి
ఎవరెస్టు సుందరి !
ఎలుగెత్తి పిలు
కల చీల్చి నడు
కనకకాంతిలో నడుస్తున్న ఆ శాంతి కాంతను దిగిరమ్మను
జనతాపరిత్రాణ సమతామృతమూర్తిని దిగిరమ్మను
కురులకాంతి తప్ప చీకటిలేని జగమ్మును
త్వరితంగా సృష్టించాలని దిగిరమ్మను
నీ వెల్తురు పిల్పు ప్రమింగి విచ్చుకుంటుందా హృదయకనకపద్మం
నీ వసుధైక్యమ్మవుతుంది ప్రతిసద్మ భూతలస్వర్గం.

—పి. యస్ ఆర్

# ఏడవ ఋతువు

పూలు, తేటులు, కోకిలాలు రామన్నచో
మఘ మాసపు బెడంద మండి, ఎండియ పోవు.

ఎల నీరు, గందమ్ము, వలిగాలి వీడుచో
వేసంగి బ్రతు కగ్గిమూస కాల్వలు కట్టు.

పైరు పచ్చన, లూడ్పు పాటలు లేనిచో
ఘన వర్ష మడవి గాసిన వెన్నెలే యౌను

నల్ల గల్వలు, రాజనాలు కాదన్నచో
శారద మన్కి మంచము బట్టి మునుగితును.

బంతి, సంక్రాంతి, దుప్పటియు లేమన్నచో
పుష్యమ్ము వలపు తలపులు రాలి మోడౌను.

శివరాత్రి వేకువలు చవులూర కున్నచో
శిశిర మాశలు మారి చివురు మంటల గూలు.

ఆరు ఋతువుల కున్న ఆపదలు తొలగించి,
ఆరు ఋతువుల శోభ లందుకొని ధరియించి,
ఆరు ఋతువుల జీవితానంద ఫలమవై
కాంత ! ఏడవ ఋతువుగా వెలసినా వహో !

— ఖీమన్న

## ఏ నీడనో

ఏ నీడనో నన్ను బ్రతుకనీ స్వామీ
ఏనాడు నీజోలికే రాను నేను
ఏల నాపై నీకు యీకోప మింత
ఏనాడు నీఊసు ఎత్తనే లేదు.
పదిమందిలో నన్ను పడవేయబోకు
పదిమార్లు చేయెత్తి మొక్కుతా నీకు
ఏ నీడనో నన్ను బ్రతుకనీవోయి
వెలుగులో కేల నను లాగెదో స్వామీ
పలుకగా నేర్వని దాన నేనోయి
పలుగాకిగా నన్ను తలుపబోకోయి ॥ఏనీడ॥

—చంద్రమౌళి

## కేంద్రము

ఏన కేంద్రము ఈ సృష్టికెల్ల ; నేను,
నా కుటుంబము, నా జాతి, నా ధరిత్రి,
నా ప్రపంచము——ఈరీతి నన్ను బట్టి
సృష్టియెల్ల నాచుట్టు పరిభ్రమించు.

మనుజధర్మము, ప్రకృతిధర్మమును నిదియ ;
నాకడ ప్రయాణమౌ దిగంతముల విరియ ;
దీనికి విరుద్ధరీతి బోధింపబడెడు
నీతు లెంతటివైన నన్నియును వృధలె.

నన్ను మేల్కొల్పి, "సర్వేజనా స్సు" ఖాధ్వ
మందు నడిపించు ప్రత్యూష మధురగీత
మొకటి చాలును , రుద్రవాటికి మరల్చు
నికృత తిమిరాల నేల బంధించు తలపు ?

ఏన కేంద్రము ఈసృష్టికెల్ల ; నన్ను
నేను ప్రత్యుదయమ్ము రూపించుకొంచు
ముందునకు బోదు ; దీని సంరోధమెల్ల
పుక్కిటి పురాణమై చెదపుట్ట జేరు

— భీమన్న

## క్షుభితపథయాత్ర

తరలె వసంతముల్ సుమవితాన
        విహీనత, దారుణాతపా
దరణఁగజంగె దర్పమును,
        తద్దయు వ్రాలెను కుంభపోతలన్
పరువము దప్పి దావలత,
        పత్రము లల్లన రాలె శైశిర
స్ఫురణల నౌర ! సత్కుసుమ
        భోగమరందము లంద వెందునన్ !

ఏనెఱుగన్ త్వదీయతల
        మెయ్యెదో ? చేరగ మార్గమెట్లో ? నీ
యాననదీప్తి చంద్రికల
        యాదరమెంతయొ ? రాగపూర్ణ హృ
త్పాన మధూపభోగ పరి
        తోషితులేరో ? మదీయ మానసో
ద్యానలతాంత మొక్కటి
        పదాంతికమైనను జేరనిత్తువో ?

శ్రీనిరవొందు సౌఖ్యములఁ
జెన్నగు టెన్నడొ తోచకుంట నెం
తేని దరిద్రతాఘయుత
దీనతమః పరిపూర్ణ మానసా
స్థాన విపంచి మ్రోగెడిని
తావకపాద నిషేవణాంచిత
ధ్యాన పునీతరాగముల,
తానము, పల్లవి నీవు కూర్పవే!

నగరే నన్గని తోడివారలిల
విన్నాణంపు భోగంబు లే
తగ నా పాలిటి కెండమావులగుటన్;
దాక్షిణ్యమొప్పార నీ
గగనోత్తుంగ సరిర్ఝురీ విమల
సత్కావ్యామృతాస్వాదనన్
తగనా చాన! విజేతఁగాగ, మధు
సంధాన ప్రచారమ్మునన్!

సుప్తమనోగతాంకురము
　　సూనము విచ్చి నిమేషమేని ని
క్షిప్త పరాగరేణుల
　　వశీకృత దౌత్య మొనర్ప, భావసం
ప్రాప్త మధూదయాధర
　　విభాసితసౌఖ్యము కొల్లగొందు, నా
లిప్తయె కోరుచుంటి
　　నవలీల లభింపగజేయవే రహిన్ !

చేసెడు పర్వులందెపుడు
　　జేరగ లేదొక ఘట్ట మీ సమా
శ్వాస సుదీర్ఘ వేదిక
　　నశాశ్వత బంధము లెట్లొ ప్రీలిపో
నాసల మించు దీవెలల
　　నద్భుత దీప్తుల నింపు నత్తటిన్;
బాసటలేమి నీక్షుభితపాంథ
　　పురోగతి యెట్టులుండునో !

— ల సూ నా

## గడియారం వెనుకకు త్రిప్పు

గడియారం వెనుకకు త్రిప్పు
గతకాలంలో జీవింతువు
గడియగడియ కావేదన ఎందుకు ?
సుఖసుషుప్తి కాలంలో దాగిన
సుందర స్వప్నా లెన్నో ఎంచుకో !
వర్తమానకాల విహంగాల
రెక్కలపై విహరించు
విరామంగా నిర్విచారంగా !

తుది భోగపు అంచుల చివరల
దాగిన ఆనంద తుషారం
మకరందంలా గ్రోలు యీసారికి
మరొక్కసారి, మరల నొక్కసారి.
"పెనోరమ ఆఫ్ విజన్"లో
పడిపోవోయ్ ముందుకు చూడకు.

తృణకాలం, క్షణకాలం
అనుభవాల హద్దులలోకి
సంఘటనల సామీప్యంలో
సాగిలబడవోయ్ మానిసి!

ఈనిశీధి విలపించకు
అమవసలో అరణ్యవేదన
అలసిన హృదయం మూల్గె రోదన
కళ్ళులేని ఘూకారావం
ముసలికుక్క కంఠావేగం
ముంచెత్తే పాపపువేశిది.

ఎవరికోస మెదుకుతావు ?
ఎందుకు అటు మసలుతావు ?
కనుచూపుల బాధల పీడన
జీవితమొక చేదు మాత్ర !

అందుకనే వెనుకకు నడువు
అణువణువున ఆశలు గొలువు
చిగురించిన కోర్కెల జూడు
విహరించిన జీవిత మెదుకు
మానవుడా మరువకు రోజులు
మునుముందర మృగ్యం సౌఖ్యం

పృచ్ఛించే జీవిత యానం
పగిలిపోయినట్టి పడవ
అన్వేషణ ఆవేశంలో
కాటుబడకు త్రాచు చేత
మోదుగు పుష్పం కంటె
మించినదేం లేదు నీవు

ముందు అగాధంలో మరి
మునకలేయకోయ్ !
తస్మాద్జాగ్రత్త యటంచూ
చూచి నడవవోయ్ !
కడమట్టుకు పట్టు ధైర్యంతో
కళాసికి వలె చుక్కానిని
కలవరపెట్టే కాంక్షల
నదిమిపెట్టు కొంతసేపు
వూపిరి బిగ్గరగా పీల్చుకు
వూహాల మరి జీవింపవు.

మానవుడా ! బ్రతుకే ఒక
భారమైన మేదకుడా !
అరిగిన సౌఖ్యం కోసం
ఆరిన భాగ్యం కోసం
గడియారం వెనుకకుత్రిప్పు
గతకాలంలో జీవింతువు
గడియగడియ కావేదన ఎందుకు ?

— గోపినాథ్

## గౌరీపతీ !

శ్రీమత్తావక దివ్యపాద యుగళీ
సేవార్పితాత్మీయ హృ
ద్ధామాక్రాంత సమస్త దుర్విషయ
సంధానైక దుర్జ్ఞానవ
త్కామాది ప్రబల ద్విష ద్విదళ
నైక్యజ్ఞాన సంపన్మనో
ధీమాహాత్మ్య మొసంగ వేడెదను
తండ్రీ ! నిన్ను గౌరీపతీ !

పారంబుం గనరాని విస్తృత మహా
పాథోనిధిం జేతనా
ధారంబై వెలుగొందు వాయువున
నుద్యద్భాను శీతాంశుమ
త్తారామండల మండనాభ్రమున,
చిత్త జ్ఞాన విశ్వాతిగ
స్ఫారాగ్రంబున వెల్గు నిన్ను మది
సంభావింతు గౌరీపతీ !

భూరాపోఽనలవాయుఖాత్మకమునై
పొల్పొందు విశ్వంభరా
భారం బెల్ల వహింపఁ గుక్షి నిడి
జీవవ్రాత మానందపుం
బారావారము నందుఁ దేలఁగ
శుభప్రారంభముల్ గూర్చు నీ
కారుణ్యంబును సంస్మరించెదను
భక్తత్రాణ ! గౌరీపతీ !

సరసీజాసన వాసవాది సుమన
స్సందోహ సంశ్లాఘ్యమై
పరమానంద రసాశ్రయంబయి,
యశోభాస్వంతమై యొప్పు త్వ
చ్చరణాంభోజ నిరంతర స్రవ సుధా
సారంబు పాటింపుమా
స్థిరతన్ శాంతియు నిల్వ మామక
మనఃక్షేత్రాన గౌరీపతీ !

పాపాయంబగుఁ గాయమెంతయును
నిత్యంబంచుఁ గుక్షింభర
వ్యాపారంబున మున్గి సంతతము
మాయామోహముం జెంది యీ
పాపాగారమునందు మున్గి తెటు
ప్రోవం జూతువో దివ్య మో
క్షోపాయం బెఱిఁగించి సత్కృపను ?
సద్యోజాత గౌరీపతీ !

ఆ యజ్ఞానసనుఁ డా దివౌకస గణం
బా మౌనిసంఘంబు నిన్
వా యారంగ నుతింపలేరన
నుతింపంజెల్ల నెట్లొను నీ
మాయాంభోనిధిలోనఁ జిక్కువడి
సమ్యగ్భక్తిహీనుండనౌ
నీ యజ్ఞానికి నీ శరాత్మనకుఁ
ద ద్వృత్తంబు ? గౌరీపతీ !

బహుధా కల్పితమై తనర్చిన మహా
 బ్రహ్మాండ గోళంబుఁ బ్ర
త్యహముం జిత్ర విచిత్ర రీతులను
 జెన్నైయున్న నత్యంతమున్
విహ్వృతిం జెందితిఁ దావ కామృత
 కృపావీక్షం బ్రసాదించి త
న్మహనీయస్థితి నుంతయే నెఱుఁగు
 జ్ఞానం బిమ్ము గౌరీపతీ!

"భవనాశాయ, దిగీశవందిత కన
 త్పాదారవిందాయ, స్వ
ర్భువి పాతాళ నభస్తలావృత జగ
 త్పూర్ణప్రభాంగాయ, ది
వ్య వివేకాంచిత మౌని మానససరో
 హంసాయ, దివ్యాయ, శ్రీ
శివదేవాయ నమోఽస్తు తే" యనుచు
 నిన్ జింతింతు గౌరీపతీ!

— నిడదవోలు

## ఛాయారేఖ

౧

పరుగిడు కాలమనే జలదేవత
ఎగురుచున్న చేలాంచలముల
మెరయుచున్న మృత్యురేఖ!

౨

ప్రతి ఒకటీ ఒకసమస్య-
తెగీ తెగని ఆశాలత-
చీకటిలో నినదించే నిశ్శబ్దార్భటి-
తెలియరాని కాలపు లోతులు-
శాంతికొరకు పెనగులాట-
అచుంబిత ప్రణయరాశి!!

౩

దుఃఖ వర్ణ చిత్రిత మీ
జీవిత మొక కరుణగాధ;
అగునుగాక భగవదేచ్ఛ!

— చక్రవర్తి రంగస్వామి

## జలదసరస్వతి

ఆకసము జూచినంత గ్రీష్మాతపాతి
భీకరంబయి గుండియదాక మండు !
లోకమెల్ల పయోధరాలోకనార్థి
శీకరస్నానసౌఖ్య మాశించు నేడు.

నల్లని వేణికా భరమునన్
రవిబింబము డాగిపోవగా
చల్లని చూపులన్ మెయిలు
జాడల వైద్యుత వల్లికా వల
గ్నోల్లసితాంగియై, ఉరుము
లూరక గర్జియలట్లు మ్రోయ నా
యుల్లమునందు వార్షుక
పయోధర భామిని నాట్యమాడెడిన్.

అదిగో ! పశ్చిమ వార్ధి సాచిన
కరంబై మేఘమే వచ్చుచు
న్నది, మార్తాండుని చేయిపట్టుకొని
పంతంబార కొంపోవు చు
న్నది, గ్రీష్మాతప తప్యమాన జన
చింతా స్వాంతముల్ శాంతిలున్
గద ! నీలాంబుధర ప్రమోదకర
తద్గర్జా వినాదమ్ములన్ !

కామినీ ధమ్మిల్లకంబయి తూర్పున
చిరుమబ్బు లేతున్క చెంగలించె,
ప్రేయసీ భుజలతా వేల్లితాంచల రీతి
నొక మబ్బు దక్షిణానకు తొలంగె,
భామా పయోధర భారమ్ము తలపింప
నొక మేఘ ముత్తరానకు చరించె,
కాంతా పదాంక సంకాశమ్ములై మబ్బు
ముక్కలు నడిమింటి కెక్కి నిలచె,
వివిధ ముద్రలతో నాట్యవేదిపైన
నృత్య మొనరించు నర్తకిరీతి దోచె,
తీవ్ర వాతూలపక్షి పక్ష వ్రజ
ప్రఘాత సంధూత జీమూతగణము నేడు.

చేజేయి కలిపి పచ్చిక బయళ్ళ చరించు
నూత్నదంపతియయ్యె నొక్క మబ్బు,
విరహబాధాతప్త తరుణియై తలవంచి
కన్నీరు నించె నొక్క జలదంబు,

స్నానమాడుటకయి నదికేగి నీరాడి
　　చనుదెంచు తన్వియోజ నొక మేఘ,
మాలింగనార్థినియై బాహువులు సాచి
　　ఉరికివచ్చెడి కాంత ఒక్క మొయిలు,
సేనెయై మిన్ను దారుల నిలుచు నొకటి,
తానయై వ్యోమభాగాన తరలు నొకటి,
విడివడిన ప్రేయసీ ముఖబింబ మూని
ప్రక్కప్రక్కన నిలుచుండవచ్చు నొకటి.

నవనీరద రథమ్ము నడిపింతు దివిదాక
　　పవమాన జవనాశ్వపటలి బూన్చి,
మందాకినీ కంజ సందోహ గంధమ్ము,
　　నిండింతు నీ భూమి మండలమున,
ప్రహ్లాదినీ వల్లికావ్రాతముల్ తెచ్చి నా
　　తోటలో నీటుగా నాటగలను,
నరులతో సురల చుట్టరికముల్ పెరుగగా
　　ధరకు నాకమును లొందరగ తెత్తు,

భూదివము లేకమై కాంతిపుంజమట్లు
నీలనీలాంబరమ్మున తేలియాడ
అచ్చరలవెంట మేఘ పల్యంకి నెక్కి
వానదారుల పయనింప వలతు నేడు.

మేఘమందు నా కమోఘమ్ము సంప్రీతి
మబ్బు పంచభూత మయమె కాదె!
అంతెగాక దాన నలరారు కరుణమ్ము
గుండె కంటి నీటి కుండగాగ.

మబ్బులోన విందు మదవతీ పాద
మంజీర యుగళ మంజు శింజితమ్ము,
మబ్బులోన కందు మానినీ నయనాంత
గళిత బాష్పబిందు కణ గణమ్ము

మూగివాని నోట రాగాలు పాడించ
ఇసుక నేలలందు మిసిమి నించ
సాగివచ్చె నేడు జలద సరస్వతి
కాళ్ళ హంసకములు గల్లు మనగ.

— దాశరథి

## తామసి

ఇరులు నిశాసతీ భుజము
లెక్కి శిరమ్మున నిక్కి తారకా
తరుణుల గల్ల భాగములు
తాకి విహాయస వీధి బ్రాకి చం
దురుపయి సోకి భూధరము
త్రోవలలో పయనించి మెల్లగా
ధరపయి కాలుమోపెను కదా!
హరినీల వినీల కాంతులన్.

ఇటుప్రాకి అటుప్రాకి ఇందుబింబాననా
ముఖముపై కస్తూరి బొట్టు పెట్టి
ఇటుదూకి అటుదూకి కుటిల నీలాలకా
భ్రుకుటికాధనువు నంబకము కూర్చి
ఇటుసాగి అటుసాగి ఇందీవరేక్షణా
పక్ష్మ భాగములపై వచ్చి వ్రాలి
ఇటువీగి అటువీగి మృగనేత్రి బంగారు
చెక్కిలిపై అగర్చుక్క నునిచి

వెండికొండపయిన్ మబ్బువిధము తోచి
చంద్రకేదారమున లేడిచాయ తిరిగి
ఆదిశేషునిపై విష్ణువై శయించి
చీకటులు కూర్చె నందమ్ము లోకమునకు.

ఇరులు కోకిలములై ఎచ్చోట కూయునో
అచ్చోట ఆమని అవతరించు
ఇరులె తుమ్మెదలుగా ఏవేళ మ్రోయునో
ఆవేళల వసంత మాగమించు
ఇరులె ఉత్పలములై ఏనాడు పూచునో
ఆరోజు నవశరత్తన్నమాట
ఇరులె నెమళ్ళయి ఎట నృతి సేయునో
అటనె నవాషాఢ మందగించు
ఇరులకన్న అంద మెచట కానగరాదు
ఇరులె అందమునకు దిరులుసుమ్ము
ఇరులు లేనినాడు నరులు కానగరారు
నరులు లేనినాడు ధరణి లేదు.

కబరీ భరమ్ములై కనిపించు చీకట్లు
కావలె నాకెల్ల కాలములను
నల్లకల్వలవోలె నాట్యమాడెడు నిరుల్
కన్పించవలె నెల్లకాల మిచట
నీలమేఘమ్ములై నింగి ప్రాకెడి తమం
బెల్ల వేళల వికసించవలయు
జవరాలి కనుపాపచాయ దోచెడు సాంధ్య
మన్ని కాలాల ప్రత్యక్షమగుత
ఇరులె కురులయి ఝురులయి పరుగులెత్తి,
ఇరులె కరులయి హరులయి ఇంపు నింపి,
ఇరులె తరులయి సురలయి ధరణి నిండి,
ఇరులె నరులకు మరులు కల్పించవలయు.

తిమిరలతా కుడుంగమున
దీపము పెట్టెడి వెఱ్ఱిదాన, దీ
పము పురు, వీ మహాంధ్య
మది పాము, పృదాకువు పుర్వు మెక్కునో

కృమి ఉరగమ్ము మ్రింగునొ
      గ్రహింపుము పైదలి! తామసీ తురం
గమ ఖురఘట్టనమ్ముల
      వికావికలైనవి దీపదీధితుల్

వెచ్చదనములేని వెఱ్ఱిదీపమ్ముల
పెట్టదలచెదేల పిచ్చిదాన,
వర్షధారవోలె వచ్చు చీకట్లలో
మట్టి దివ్వె నిలుచుమాట కల్ల

గౌళి నాల్కమీది కంటకమ్ములలోన
చిక్కుకొన్న యట్టి చిన్నిపురుగు
అంధకారమందు ఆటాడుదీపంబు
మరు నిముసమునందు మడియగలదు.

అంధకార గృధ్రమార్చెను పెనురెక్క
లంతటను తుఫాను లలముకొనియె,
చిన్నదీప కళిక యెన్నాళ్లు నిలుచును?
మలిగిపోవుగాక మరు నిముసము.

ఆకాశమ్మది చీకటిల్లు శశి
తారార్కావళుల్ మిణ్గురుల్,
లోకంబియ్యది చీకటింటి
పరదాలో నున్న మృత్పిండ; మిం
దాకల్పింపగ జూచెదేల
పరిహాసార్థమ్మొ ! దీపావళీ
ప్రాకారమ్ములు ? తామసీ
ధరణికంపం బల్లదే వచ్చెడిన్.

విద్యుద్వల్లిక శాశ్వతమ్ముగ
నభోవీధిన్ ప్రభాదండమై
విద్యోతించిన రీతి నుండిన
నినున్ వీక్షింపగా లేను, నీ
ఖద్యోత ప్రతిమాన తై జసిక
శృంగారమ్ము నాకేలనే,
ఆద్యంతమ్ములు లేని చీకటి
పథం బందేగు ఘూకానకున్ ?

— దాశరథి

## తెలుగు తల్లీ !

తేనెపలుకుల తెలుగుతల్లీ !
రవలవెలుగుల తెలుగుతల్లీ !
తేజునెరపిన తెలుగుతల్లీ !
ఆశిషమ్ముల నిమ్ముతల్లీ ' !
ఆదరింపగ రమ్ముతల్లీ ! ! !

శాతవాహన శకములోపల
శాంతిపారము నేర్పితమ్మా !
పూర్వవేంగి యుగములోపల
పుణ్యకవితల జెప్పితమ్మా !
కాకతీయుల కాలమందూ
ఖడ్గపాండితి గరపితమ్మా !

రెడ్డిరాయల రాజ్యమందూ
లలితకళలను దేల్చితమ్మా !

గాంధిదేవుని యుగములోపల
సదయహృదయుల గాంచితమ్మా!
సర్వమానవ సమతగూర్పగ
భారతాంబకు యశమునింపగ
కదలిరమ్మో తెలుగుతల్లీ!
ప్రోవరమ్మో తెలుగుతల్లీ!!

త్యాగి రాముని మహిమవల్లా
తనరు అరమరిక లవిచెల్లీ
తనయులెల్లరు కలసిమళ్లీ
'తఖ్తు' నమరిచి రమ్మ నేడూ!

భారతాంబకు రత్నమేఖల
భాగ్యనగరం రాజధానీ
భాగ్యరేఖలు అలముకొనగా
పేదసాదల నాదుకొనగా
ఆశిషమ్ముల నిమ్ముతల్లీ!
ఆదరింపగ రమ్ముతల్లీ!!

—పిల్లలమర్రి

తెలుగు బౌద్ధము

ఒకచోటనేమి ? తెలుగుల సకలోర్విని
ఎచట త్రవ్వ, చైత్యకములు, స్తూపకములు
పద్మాసన గత ముకుళిత నేత్రములు
ధ్యాన ముద్రా రీతుల్.

పదికాలాలు గతించియున్ చెడదహో బౌద్ధంబు
తద్బోధ మాయెదలన్ మెత్తన మేలుకొల్పినది

ఆయెల్లన్ పురాధర్మ సంపద కాణాచిగ దాచిపెట్టుకొని
ఈ మా తెల్గు మాగాణము
అభ్యుదయ ప్రాప్తికి చిహ్నమై వరలుటొప్పున్
ధర్మచక్రప్రథన్.

మరచెన్ భారత జాతి ద్వేషము
అహింసా ధర్మ సందీప్తిలో తెరచెన్ క్రొత్త కవాటముల్
వెలుగు లొత్తెన్ దేశదేశాలలో
దురముల్ రేపిన రాజనీతుల పునాదుల్ కూలిపోయెన్
వసుంధర నల్మూలల పంచశీలయని యన్నన్
వేదవాక్యై చనున్.

బ్రతుకున కెన్ని కాలములు పట్టునొ
సత్య పదార్థ మూలమున్ వెదుకుట ?
తద్గతంబయిన విశ్వకృషిన్
మహనీయ బౌద్ధ సంపదల అపారమై చనిన పాత్ర
కృపారస పూర్ణకుంభమై
కదలినదెల్ల చోట్ల జడిగానయి
చల్లదనాల వెల్లువై.

ఎందరొకో పురాఋషిమహేశ్వరులు
ఒక్కొక రొక్క వ్యాఖ్యతో ముందుకు వచ్చి
జీవితము ముందర చిందులు త్రొక్కినారు!
వారంద రహింసవంటి పరమాద్భుత ధర్మము నిచ్చిరే?
నవస్పందన తెచ్చిరే?
జగతి పండిన మూర్ఖపు గుండెలందునన్.

వరుసగ రెండువేల్సనిన వర్షము లన్నియు
కుండపోతగా కురిసిన బౌద్ధ ధర్మముల కొంచెము
కొంచెము మెత్తనై, వసుంధర ఎదచల్లనై,
రణకధల్ వెనుకాడిన చొప్పుదోచు
సంగరముల ఘోరమారణము కల్గని
ఒక్క సమాజ లక్ష్యమై.

ఒకయద్ధి వచ్చి
వేరగు నొక యబ్ధింగూడి
తరగ లుబ్బిన యటులై
ఒక సత్యము తోడ
అహింసకు ముడివడి
దేశముక్తి సాధన కలిగెన్.

పదునెక్కెన్ తెనుగుం జరిత్ర
బహుశిల్పప్రౌఢ సౌందర్య సంపద మెక్కెన్
తెనుగుం గళా విభవ సామ్రాజ్యంబు
నిర్మాణపుం పదమెక్కెన్ తెనుగుం బ్రదేశములు
దివ్యక్షేత్ర విస్ఫూర్తి
భూతదయా శీలము పొంగి
తెన్గుల మనస్తత్వంబులో భాగమై

బలమై బౌద్ధము కాలుపెట్టిన యెడన్
బంగారముల్ పండె
తెల్గుల మాగాణములెల్ల నాగరికతల్ పూలెత్తె
సత్కీర్తివల్లులు విజ్ఞానపు వీధులన్ పసిడిజల్లులాృరె
దేశాంతరంబుల క్రొత్తర్థము నేర్చుకున్న బ్రతుకుల్
పొంగారె సౌహార్దముల్.

తెలుగుల కృతజ్ఞతా బాష్పములను కొలువగలదొ
నాగార్జునాఖ్య సాగరము కూడ!
కాలువలుపారి సస్య విక్రాంతి
తెలుగు జీవితమె
బౌద్ధమైన విస్తృతి వహింప?

—కుందుర్తి

## దిదృక్ష

ఆకాశం పుష్పంలా
అందంగా నవ్వించే
ఆ నవ్వుల జీవిత మా
గ్గాంతరకళ వెలిగించే—
మరుక్షణమె మొగమంతా
మసిలాగా మారించే
కనుగొలకుల కాటుకవా
కల సుడులను త్రిప్పించే
మణిమాలా గణజ్వాల
త్కళావిలాస లాస్యాలే
జీవనభృతి జీవనధృతి
మధుస్మృతుల తలచించే
దరస్మేర ధరాధార
పరీవృతుల వెదకించే
ముహుర్ముహుశ్చలత్స్ఫుర
త్సురాసురుల జూపించే
జీవితరణ మారణచణ
ఘోరాస్త్రాలే చూపించే

ఖండిత రక్తారుణ నర
కంఠాల్ తిలకించిందే
కారుణ్యం తారళ్యం
ధారాసుధ పొందిందే
నిశ్చంచల నిర్మల సం
చిత జీవిత మరసిందే
వీచీగరు దుచ్చంచల
విద్యుల్లత లరసిందే
విశ్వోజ్జ్వల శోభామయ
విధుల నిరీక్షించిందే
ఆ శశిసుందరవనిలో
ఆశాలత పెంచిందే
ఫలావాప్తితోడ స్వయం
ప్రభాశక్తి చూపిందే
నిలచిచూడు మానసమా
నీలిపూల ఆకాశం
ప్రార్థించుమ కొనగ నమృత
పాత్రలోని మధులేశం

— జూలూరి

## దీపావళి

ఈక్షణమో, మరుక్షణమో యంచెంచురీతి,
మూసికొనివచ్చె కారు మబ్బులు జగాన,
జనుల వేడుక మాత్రము సంకుచితము
నొందలేదందు, నుత్సాహ మొదవెనింక.

తీరిచి నూనెనిండు నటు
తెచ్చిరి దీపపు పళ్లెరమ్ములన్
నేరుగ, వేలకెక్కుడుగ
నే యవి యుండును, తత్ప్రదీప్తులా

దారులలోన పట్టణపు
తత్తులలన్ వెలివెట్టె, ధానుడే
కోరుచు, ఖండమాత్రుడయి
కూడెనొ, ఒక్కొక దీపమంచునన్.

పదులరొలంది రూప్యముల
పాడొనరించి మతాబు లాదిగా
నొదవెడు వస్తుజాలముల
నొక్కట కాల్తురు గొప్పవారు, ఆ
యదనున ప్రక్కనిల్చి,
సగమైన, పడస్వేడ, జూచి దానినే
పదిలముగా గ్రహించి
ఎద పండుగ చేతురు బీదవారలున్.

పరమ సంతోషపుం పారవశ్యపటిమ,
పగులనుండెడు హృదయంబు పగిది, నందు
చెలగి నైరాశ్య జీవనస్థితికి నొగులు
వగపు హృదయంబు చాడ్పున పగిలెనదరి.

వెసను దీపావళీ 'ఔట్లు' పసితనంపు
పద్ధతిని ఆటలాడెడు, బయల, జనము,
కడుపులో దుఃఖకళికలు గ్రాలుకొనగ
దాని తిలకింత్రు కొందరు తాపఘణితి

మలగుచున్నవి మలగగా, వెలుగుచున్న
దీపములకాంతి దీపించె, దిగులు గుండె
గుములుకొన్న ఆశాజ్యోతి కోటివోలె,
ఆరినవి క్రుంగి జను హృదయాలవోలె.

భగ్నహృదయాల యందలి భయదఘోష
పేదతనపు విచార ప్రపీడహేష,
ప్రళయ మేఘూర్జితోద్ధుర రవము మరతు,
జటులత న్వస్తుపెటపెటార్భటులలోన

పొరలి వచ్చెడు దుఃఖంపు తెరల నవల,
పొంగి జనుదెంచు మోదసముద్రమవల,
మెలగి వ్యాపించు ప్రశాంతి లవమట్లు
నందగించెను తదుపరి అర్ధరాత్రి.

— భద్రిరాజు

## దీపావళి మంటలు

చీకటిదూరి గబ్బిలము
    చేరి నిషిద్ధ భయానకక్రియా
వ్యాకులితమ్ముగా మొరడు
    వారిన విచ్చటి యీ కుటీరముల్

ఆకలిజీవులై యిచట
        నార్చిన కూయితరంగముల్ వినం
గా కదలాడ లోని
        విముఖత్వము వాకిట దీపమెందుకో.

కానీ లోకము చూపులో వెలుగు
        మార్గమ్ముల్ మమున్ మ్రింగు వ్యో
మానీతోజ్జ్వల విద్యుదుగ్రములు,
        క్లిష్టాకృష్ట జీవాస్థిక
ప్రాణమ్ముల్, రణితప్రమాదకర
        సర్వానంతవైవిధ్య కే
ళీనాద ప్రకృతిస్థముల్, వలదు
        తల్లీలామహావ్యాళముల్.

అసలు పెదవులపైన నృత్యమ్ము సేయు
శాంతిసూక్తులపైన విశ్వాసముంచి
వ్యర్థమౌటకుమించి విప్లవమహాగ్ని
పేర్చి మీకు దీపావళి కూర్చుకొందు

మాలో ప్రేవులు మండుచున్నవి,
వ్యధాప్రాణాలపై నుండి ఏ
వో లోకమ్ములు దగ్ధమైనటుల
నాహూతౌగ్ర్య మగ్నిచ్చటా
స్వాహాకాంతులు నావరించినవి,
నిస్స్వార్థక్రియాభూతి తా
మాహారమ్ముగ చేసికొన్న
ప్రజకేనా నేటి దీపావళుల్ ?

ఇవిగోమాదు శరీరముల్ నిలిపి
నా మిచ్చోట, మాలోసెగల్
భవనజ్యోతుల వెల్గుమూలములు,
మాభావమ్ములున్ తీవ్రతీ
వ్ర వధార్హమ్ములు, మాయెదంగల
కథావ్యాసంగముల్ నిష్ఠుర
త్వవచశ్శ్రేణులు, మాకునగ్గినిడుడీ,
ప్రాప్తించు దీపావళుల్

— పి. యస్ ఆర్.

# దీపావళి

దీపావళి దీపావళి
ఇంటింటను దీపావళి
వీధివీధి దీపావళి
వాడవాడ దీపావళి
ఊరూరను దీపావళి
దేశమంత దీపావళి !

ఈ దీపావళులన్నీ
ఏకైకాలోకం
లోకైకాలోకం.
అయినా—

నిరుపేదల గుడిసెల్లో
సహస్రాక్ష సహోదరాల్లో
చిక్కని చిమ్మ చీకట్లు
పేరుకుంటునే ఉన్నవి !

రిక్షా లాగీ లాగీ
దిగజారిన గుండెల్లో ;
జ్ఞాతాజ్ఞాత మానవాళికోసం
అస్థీ చర్మం ధారబోసే
పేదరైతు అమాయకపు నవ్వుల
తెర వెనకాతల ;

గనగన మండే కొలుముల ప్రక్కను
ఎఱ్ఱగ కాలిన ఇనుప కమ్ములను
సమ్మెట వ్రేటుల సాగగొట్టే
కమ్మరి చెమ్మట మబ్బుల్లో ;

అదృష్టవంతులు ఆనందించే
ఇనుపపెట్టె పెనుమేడలకోసం
నల్లరాళ్ళను నలినలి చేసే
నరయంత్రాల వినిశ్వాసాల్లో ;

గణతంత్రం పేరుచెప్పి
ధణుతెగిరే ఉపన్యాసం
దంచేస్తూ ముంచేస్తూ
తిరిగే ఘనుల అంతరంగాల్లో ;

కట్టించే దేవళాల-
పెట్టించే ధర్మశాల-
వెనకాతల మెలిక తిరుగు
ఇరుకుల బేరపు దారుల్లో ;
నీతి ధర్మ పన్నాలను
చాతుర్యం చూపిస్తూ
ఇంటివద్ద కలియమనే
ఉద్యోగుల నడకల్లో-
కోరుకానే
పేరుకానే
కటిక చీకటుల దొంతరలు
వెసూవియస్ లావాపొరలు
భంగపడవు
భంగపడవు !!

సొరమంటల కడుపులలో
గురగురమను ప్రేవుల రవములు
కడబట్టిన ఆకటి ప్రాణుల
కడపటి గుండెల దడదడ

కల అన్నల పిల్లల చేతుల
సురసుర సురసుర ధామ్మను !
ఇరువది నాలుగు గంటలు
చా హండీ దింపని వారలు
చా త్రాగిన దానికంటె
ఆరురెట్లు—రోజంతకి
ఆరుగంటలే ఊరే
ఊరి పంపులో త్రాగిన
నీరు చుక్కలు చుక్కలుగా
ఆలుబిడ్డల అడలు చూచి
కనుగొలుకులనుండి రాల్చే
హమాలీల ఎముకల గూళ్లు
గాలికి కందే బంగరు చేతుల
పూలురాలు ముత్యాల వత్తులు ! !

దీపాలకు వెలుగిచ్చే
దీపాలవి · దీపావళి !
అంధకార బంధురాల
కతిదూరము : దీపావళి!

బెంగుళూరు పట్టుచీర
కట్టుక గునిసే పట్టికి
బతిమాలి బనారసు జరీ
బుటేదారు చీర పెట్టీ ,
బంగరు బొమ్మల నిచ్చి
ఉన్న దెల్ల ఊడ్చిపెట్టినా
పొద్దుపెట్టి మూతి ముడుచు
పై దర్జా అల్లుళ్ళకు
అప్పుచేసి అలక తీర్చి
ఆనాటికి మురిసిపోవు
సంసారుల ఆరబోవు
ఆశావళి దీపావళి !

వత్తి వెలుగుతూ పొగవదలుతుంది ;
వెలుగు వత్తినే కాకుండా
ప్రమిదలలో చమురంతా
పీల్చివేసి మసి చేస్తుంది ! !

దీపం వెలుగే హెచ్చా ?
దీపానికి నలువంకల

సంకులమై పంకిలమై
మేకొను చీకటి హెచ్చా?

కనుపండువు దీపావళి
కనజాలని చీకటిపక్షని
అనుకోకుడు - అందరిని
అభిలషితమె దీపావళి :
కావలె నొక దీపావళి—
క్రాంతిభావ దీపావళి.

కొద్ది గొప్ప కొదలు లేక
పేద ధనిక భిదలు లేక
మానవ మాత్రుల ముఖములు
మహోజ్జ్వలము లొనరించెడి
దివ్యభావ దీపావళి !
కావలె నొక దీపావళి
క్రాంతిభావ దీపావళి ! !

మానవ మహిషాసురులను
మార్చివేయు దుర్గాంబిక
శరదాకాశ సుహాసం
భాసించే దీపావళి

కావలె నొక దీపావళి
క్రాంతిభావ దీపావళి!

దారిద్ర్యాంధకారం
అజ్ఞానాంధకారం
దుర్భావాంధకారం
పటాపంచ లొనరించే
మహాలక్ష్మి
మహాసరస్వతీ
మహాకాళీ
రాగారుణనయనాంచల
రుచి విరచిత దీపావళి
కావలె నొక దీపావళి
దివ్యభావ దీపావళి
క్రాంతిభావ దీపావళి!!
కనుపండువు దీపావళి!!!

— శ్రీనివాస సోదరులు

## దేవీస్తుతి

తీరనికోర్కెఁలున్ గుబులు
        దేరు మనస్సులతోడ కొంచె మా
ధారముకోసమై పరుగు
        దాడులుతీసెడి తత్తరమ్ములో
కారిన ఘర్మవారి
        పరిఖాకృతి నడ్డమునిల్వ క్రాగి చ
ల్లారిన పాలమాటలు
        కలంచక శాంతము నొల్కఁబోయునా ?

దాచిన దాగబోని
శతధా పరిభిన్న భయానకవ్యధా
సూచి ముఖాలముందున
యశోవిభవోజ్జ్వలతా పురార్థ గా
ధాచితి పేర్చు బెండులకు,
దానికడన్ చలిమంటవేసుకో
నా ? చని దానిలోనపడనా ?
పడి ఆచితినిన్ రగుల్చనా !

నరమునరాన మానవు
ఘనత్వమునింపి ఘనీభవింప జే
సిరి హృదయమ్ములన్ కరుగ
జేసెడి నాథుడు కానరాని మా
తృ రుధిర పానఘోర
పరితృప్తికి జారు సమాజమందు నా
కీరవు లభించునా ? ఎముకలే
మిగిలించిన దుశ్శరీరికిన్.

బ్రతుకుంబాటల ముళ్ళవోసెడి
        పర ప్రారబ్ధ భోక్తల్ సము
న్నతి నీరాజనలెత్తు యీతరిని
        నీ న్యాయమ్ము నేమూల దా
చితివే ? సంస్కృత సాధనావిమల
        రాశీభూత దిఙ్మండలీ
తత సంక్రాంతయశః కధానికవు
        శుద్ధ స్వాంతవున్ శాంకరీ !

నీ దయలో పరిప్లుత
        మనీషత తాల్చెదనన్న ఆశలే
దా ? దయివారు నీచెలువు
        దారుల విశ్వజనీన జాగృతి
శ్రీదరహాసరేఖల
        విశిష్ట ప్రకాశము కానిపించదా ?
కాదు, ప్రపంచమే యిటుల
        కాడయిపోవుట నీ ప్రభావమా ?

— పి. యస్ ఆర్

## నా రోదన

ఇది ఒక విషాద ఏకాంత జీవితం
మది నిరాశా నిస్పృహాన్వితం
జగతి వినబోదు నారోదన
సర్వనిరస్తము నావేదన.

నయనోష్ణ జలములో తడిసి
నాకలము వేదనను చింద
జగతి పరియించు నారోదన
పొగిడి కులుకును సంతసమున.

బ్రతుకు బరువుల రంగుతో
భారముగ నా కుంచె కదలి
భగ్న చిత్రములు చూచు జగతి
ప్రగతిరీతు లివియనును వినతి.

అలమటించు జనకంఠ రవళితో
మధురముగ నా గొంతు పాడగ
ఆర్తనాదములు వినుసు జగతి
కరతాళములు చేయు నెగసి.

నిట్టూర్పు గాలులకు ఊగుచు
నిండైన నా అంగభంగిమలు మార
తపన నృత్యములు జూచు జగతి
తనభాష చాలదను పొగడ.

నిరాశా నిస్పృహా నిర్వేద శిలలతో
నిలకడగ నా ఉలి పోట్లాడి వదల
మృత-జీవ ప్రతిమలే చూచు జగతి
మేళతాళాల పూజించు నిరతి.

జగతి బ్రతుకులమధ్య నవ్వుదును నేను
జగతికొరకు సృజియింతు నవ్వులను నేను
జగతినే రోసి ఏకాంతవాసమున
దిగులుతో నిరతము రోదింతు నేను.

— పోతుకూచి సాంబశివరావు

## ప్రత్యూషము

ఆలస నిమీలిత జీవితమున
కిదియొక నూతన ప్రత్యూషము
జ్వర పీడిత మానసమున
కిదియొక నవదిన ప్రారంభము

అటు ప్రాక్దిశాకాంత అంబరమునుండి
రవికాంతుడు లేచుచున్నాడు
ఇటు ప్రాణేశ్వరి తిరిపెమునకు
బియ్యము తెమ్మని నిద్రలేపుచున్నది

అటు రోదసి పులకితయై
ధవళకాంతు లీనుచున్నది
ఇటు ప్రేయసి అవనతయై
కాంతిలేక పడియున్నది

అటు కమలము వసు
పరిరంభమున వికసించుచున్నది
ఇటు వదనము కష్ట పరి
ష్వంగమున ముకుళించుచున్నది

అటు భానుని స్వర్ణకరములు విశ్వ
సుందరిని స్పృశించుచున్నవి
ఇటు భీకర బాధాహ_స్తము
బ్రతుకును బలిమిని పట్టుచున్నది

అటు మరుత్పవనము మెల
మెల్లన సుగంధము వీచుచున్నది
ఇటు బృహ_త్ప్రళయము శీఘ్ర
గతిని ఘనమును క్షోభించుచున్నది

అటు శకుంతముల అవ్య_క్త
మధుర నాదామృతము
ఇటు స్రుక్కిన భావ
శకుంతపు విలయా_ర్తనాదము
అటు సర్వ సౌభాగ్య
సంభరిత ప్రత్యూష సంరంభము
ఇటు సర్వ దౌర్భాగ్య
సంకలిత ప్రత్యూష విషాదము.

— జయశ్రీ

## ప్రశ్నలేని ఉత్తరం

క్యాలెండర్ కవితకు వస్తు పట్టికలో మహదొడ్డ దనుకొని
పాశీత్రుప్పు దులిపాను ఆగష్టు 15 వచ్చిందని
స్థాలీపులాకన్యాయం ప్రదర్శిస్తూ వ్రాయలేదు వ్యాసం
జోలెలోంచి సమయానికి తీసేందుకుండదు రెడీమేడ్ గ్రాసం

కళ్ళల్లో నీళ్ళు ; ఒకళ్ళడిగితే అవి ఆనందబాష్పాలు
ముళ్ళకళ్లున్నవాళ్లు ప్రశ్నిస్తే – 'రాల్తున్న మొగ్గల దుఃఖ పుష్పాలు'
మళ్ళీ జన్మజన్మాల కుండదు యీ హృదయానికి వసంతీకరణ
కుళ్ళిపోతుంది, గళ్ళభావాల ప్యాకింగ్ మహారణ వివరణ

సాదరుఖర్చుకే చోరీ, ఆశయాలుమాత్రం భారీ, అంతా తెగింపు
గోదావరిపొంగిన క్రొత్తఫిలిం వచ్చిన మన ఆదాయాలకే ముంపు
ఏదీలేకుండ ఎలా బ్రతుకుతాం, స్వాతంత్ర్య యుగంలో ఉండి
చేదుపుట్ట సిరాప్రవాహం, ఏ రంగంలో చూసినా గండి.

మొండికెత్తి రంభసౌందర్య పరీరంభణోత్సేకంతో పోయి
వుండిపోతూ ప్రారంభించిన ప్రతి కౌగిలిలోదీ అదిఒక మైలురాయి
ఎండుతున్న జీవితాన్ని అనుకున్న మహాసుందరి ముందు పిండి
చండదుర్వార సంతృప్తి కింధనం కాగలనా, ఏమండి !

ఎవరిజన్మకు వాళ్ళు ఖుషీగా ఉండాలనే, పోనిస్తురు
సవరించి కుట్టించాలి జన్మాంతర సౌఖ్యాల హామీల దుస్తులు
అవునో కాదో చెప్పలేక చెరిగిపోతున్న ఓల్డ్‌సైన్‌పోస్టు
కవులక్కాదు, చరిత్రకారులక్కూడా షియర్‌వేస్టు

చేతకాక ఇంగ్లీషుముక్కల్తో మాటలకు కొక్కాలు తగిల్చాను
ఆ తర్వాత చదువుకుంటే మన స్వాతంత్ర్య
ప్రగతిలాగే ఆనందించాను
నాతో నేను వాదించుకున్నాను నాదే మహాకవిత్వమని
ఏ తారీఖో జ్ఞాపకంలేదు, అప్పుడే వార్త - భూమి కంపించిందని.

—పి. ఎస్ ఆర్

## పాటల మీటలు

ప్రింటుకాని మాన్యుస్క్రిప్టు
జీవంలేని భవం.

ప్రింటయి నెలతప్పిన మేగజైను
వీధి కోమటి పకోడీ పొట్లం.

ఎడ్వర్టైజుమెంటు వినా ఛందోభంగ కవిత్వం
దానం లభ్యంకాని దారిద్ర్యం

రచనలు తొలిపలుకులు
పరస్పర స్తోత్ర సంఘం.

అర్ధంలేని కవిత్వం
అగాధ సుకవిత్వం

పదవి దొరకని రాజకీయం
భగ్నమైన ప్రేమఫలం

ప్రతి సభలో కనుపించు వక్త
ఫేడింగు పాపులారిటీ ఎంబ్లెం

నడివీధి నాయక ప్రతిమపూజ
రోడ్డుబూడిద హారతి ధూపం

శాంతి శాంతి నినాదం
యుద్ధభూతసిద్ధ చిహ్నం.

వేదాంతరహిత మానవత్వం
బ్రతుకు విలపించు శూన్యత్వం

గాలిమేడ తపస్సులకు
గ్యారంటీలేదు భగవద్దర్శనం.

— పోతుకూచి సాంబశివరావు

# పిలుపు

వెలికి రానేరాదో !
పిలుపు నా గొంతులో వలయాలు తిరుగుతూ
వెలికి రానేరాదో !
ఏనాటి కోర్కెలో ఈనాడు తీరునా
గానముగ మారునా ,
ఊహలే అల్లుకొని ఉయ్యాలలూపునా
మోహమును బాపునా ,
నన్ను నేనే మరచి నాట్యమొనరింతునా
వెన్నెలలు నింతునా ,
నీదివ్య సన్నిధిని నిశ్చింత నిలుతునా
పాదములు గొలుతునా !
భావాల బరువుతో పగులునో నాగుండె
పలుకు రూపముదాల్చి విలువ నార్జించునో !
పిలుపు నాగొంతులో
వలయాలు తిరుగుతూ వెలికి రానేరాదో !

— స్వాతిశ్రీ

## ప్రియచరిత

ఓ సఖీ ! ప్రియసఖీ !
ఆంధ్రకవితా సఖీ !

చిరుగాలి తెరలలో
కెరటాల పరుగులో
తరగలో తళతళల
మెరుగువా ఓ సఖీ. ఓ సఖీ

తెలుగు నేలల తేట
వెలుగులో మధురాలు
జిలుగులో పయనించు
పలుకువా ఓ సఖీ ఓ సఖీ .

పరమ గౌతమ హృదయ
కరుణా తరంగిణీ!
భరతదేశ ప్రథిత
చరితవా ఓ సఖీ  ఓ సఖీ .

అలపూవు రేకులో
నులివెచ్చ తేనెలో
తొలుదొలుత వెలుగులో
చలితవా ఓ సఖీ. ..ఓ సఖీ.

మురిపెంపు కృష్ణమ్మ
పరువిళ్ళ నురుగులో
చెరగులో నిదురించు
తరకవా ఓ సఖీ....ఓ సఖీ...

కలకంఠ గీతమం
జులరాగ సంచరిత
మలయాని లోర్మికా
నిలయవా ఓ సఖీ...ఓ సఖీ...

— జూలూరి

## పూల పాటలు

### రోజా

రోజాలు పలురూపు రోజాలు రారే
రోజాల పన్నీరులే జాలువారే
పారశీకమునుండి పట్టుకొచ్చారటే
బీగముల్ తోటలో పెంచుకొన్నారటే
పాదుషా హస్తాన పట్టుకొన్నాడటే
పడకలతొ సీతేకులతొ పఱచుకొన్నాడటే. ॥రోజా॥

రాచ మన్ననలంది రావే గులాబీ
పూల మన్ననలంది పోవే గులాబీ
మా మనంబున మురిసినావే గులాబీ
పూలవిందున కురిసి పోవే గులాబీ ॥రోజా॥

సజ్జికపు జాయతో - గొజ్జంగి నీరుతో
నీఛేకు మెరిసెనే - నీయాకు తడిసెనే
పజ్జచేరిన శతపత్ర సుందరునితో
నీమోము విరిసెనే - నీగోము తెలిసెనే ॥రోజా॥

నాకు పొదలెందుకంటావటే నీవు
నాకు ముళ్లెందుకంటావటే నీవు
అందచందాలు చాలంటావులే నీవు
అలరు తావులు కొల్లలంటావులే నీవు
ఎంతెంత వాసనే - ఎన్నెన్ని రంగులే
ఎన్నతరముగాని - యింపైన పూవులే
పూబోడి చెక్కిళ్ళ బోలు నీ ఛేకులే
పొత్తిళ్ళ బఱచిన పుష్పాళ్ళ శయ్యవే. ॥రోజా॥

సూర్యకాంతము :

సూర్యకాంతముతీరు చోద్యమ్మొ కాకున్నె
సూర్యోదయమువేళ శోధింప గనువిచ్చు
సూర్యాస్తమయమును జూడజాలక నొచ్చు
నేపూటకాపూట ఏవేళకావేళ
దిననాధు నడకల దిలకించు తులకించు
దిననాధు నడకల దిలకించు పులకించు

తలయెత్తు తలదించు తలపూవాడించు
నేజీవ చైతన్య మిట్లు స్పందించెనో
ఏ కరస్పర్శ తన్నిట్లు బోధించెనో
ఇట్టి ప్రకృతికి నర్థ మేరీతి నుండునో
అని తెలియ గాబోలు నంటిపట్టుక యున్న
అళిని యేప్రొద్దు గీతాలాపనల్ చేసి
లాలించి మెచ్చి యేదోలాగుమది గ్రుచ్చి
గ్రుచ్చి యడిగిన బదుల్ గుంఫనమ్మై చెప్ప
కునికి, విసిగి, యళిని, కినిసి - చెనసి-
తలలు మార్చుచెగాని తలపు చెప్పుటలేదు
ప్రొద్దుతిరిగెడి పూవ ! పో పొమ్మటం చని
తలవిసరిపోవగని తా నవ్వె పక్కుమని
సూర్యకాంతము తీరు చోద్యమ్ము కాకున్నె ?

నందివర్ధనము :

నందివర్ధనము - ఆనంద వర్ధనము
సౌందర్యమున చంద్ర సమదర్శనమ్ము
పచ్చకప్పురములు పాలముత్యమ్ములు
గ్రుచ్చెత్తి నీమేన కొలబోసినట్లు ;

మంచుతేకుల్లు క్రొమ్మించు తళుకుల్లు
సంచయమ్మై నిన్ను సమకూడినట్లు ;
అచ్చరల్ గట్టు నొయ్యారంపు చీర
కుచ్చెళ్లు నీమేన కొాలబోసినట్లు ;
ఒయ్యనసాగు ప్రత్యూష పవనాలు
ఉయ్యాల జంపాలలై యాడినట్లు ;
అప్సరోముఖ దరహాస చంద్రికలు
లిప్తమై నిన్ను నాశ్లేషించినట్లు ;
త్రిదివాపగా సుధామృదు తరంగములు
హృదిలోన నీకు పానొ్పాదవించినట్లు ;
అలల శయ్యల వెన్నెలల నూగులాడు
నెలవంక నీయెద నిదురించినట్లు ;
అచ్చరల్ గుప్పిళు లరవిచ్చినట్లు
అమృతమ్మది మది కందిచ్చినట్లు ,
అందమ్మ కన్నుల కద్దుకొన్నట్లు
కంటికి కర్పూర మంటించినట్లు
నందివర్ధనము ఆ-నందవర్ధనము
సౌందర్యమున చంద్రసమదర్శనమ్మ ॥

— వేటూరి

## పూల మాటలు

విన్నవోయితి వేలనో చిన్నవాఁడ
కంట నీరేమిటికిఁ బెట్టుకొంటి వంచుఁ
వలపుతో తేనె లొల్కఁగా పలుకరించి
చిన్ని పూవొకటి నగెను నన్నుఁజూచి.

నవ్యకాంతుల వికసించి నగుచునుండి
మధుర మధుశోభ లానంద మందహాస
చంద్రికల నాల్గు దిక్కుల జల్లుచుందు
హాయిగా సువాసన లిత్తునోయి నేను.

నా పరిమళమ్మదియెల్ల నవనవమ్ము
సుహృదయాభిమానము నెప్డు చూరగొనును.
వ్యవధి యెంతయటన్నది ప్రశ్నకాదు.
అట్టి యనుభూతి జగతిలో నక్షరమ్ము.

నేను - నా నవ్య నవ్యమౌ మేని కాంతి
నేను - నా గుబాళింపులలోని సొగసు
నాది - నేనన్న సర్వమ్ము నాశమగుట
నిజమె యగునుఖో స్మృతియైన నిలుచు జగతి.

నేడె వాడుదునంచు నే నెఱిగికూడ
అన్యచింతలు మాని నా అందచంద
ములకె మురియుచు నగుచుందు బుడమిపైన
బ్రతుకు కాలాన సౌఖ్యాల బడయగోరి.

సహన సాహసములు నొప్ప సంచరించి
గాలి నెదిరించి యెదురేగు ఖగము వోలె
కష్టముల బాపికొంచు నా కాంక్షతోడ
గళము సారించి జగతి నే గాంచుదాన.

కలత కలుగుట సహజమే కాని నేను
గాలివడిగ వీచినపుడు రాలిపోక
ఆకు నడుగుల దాగుచు నణగి మణగి
మరల తలయెత్తి నవ్వెద మధువు లొలుక.

లెమ్ము లేనగవుల విరజిమ్ముము
తొగ కన్నుల దరహాసపు తెలివెన్నెల
విరియింపుము, వికసింపుము, కురియింపుము
నగ వంటిన సొగసుగ నగు నీ యధర సుధలు.

నీ యెడద భారమగుచు గన్పించినపుడు
కలత కలిగించు భావాలు కలిగినపుడు
చిన్ని పూవుల వలపున చేర్చికొనుచు
పాడుకొనుమోయి తోచిన పాటనొకటి.

కలత గలిగించు భావాల దలపకోయి
తలపు లట్టివి నీలోన దాపకోయి
కలచి వేసెడి కలతకున్ కలదు పదును
నిశిత ఖడ్గమ్ము కంటె పెన్ విసము కంటె.

— మురయా

# పూలరథం

అదేరధం, పూలరధం
ప్రజల విజయ మహారధం
ప్రకటించిన మనోరధం !
గతకాలపు దారులలో గతుకులు గుణపారంగా
నేటి ప్రజా ఉద్యమాల పాటలు తన బాటలుగా
భవిష్యత్తు తన ముందర పరచిన పట్టు తివాసీ !
బ్రతుకులోన తీరిన మన బెంగలు సంపెంగలుగా
అదే రధం......

కులమత కలహాల గోల కూలిన గుడిగోపురమై
సమత గుండెలో తీర్చిన బారులు తన దారులుగా
ఆకాశ విశాలావని లోకాల శాంతిజెండా !
దేశవనం పూసిన తెలిమల్లెలు మన పల్లెలుగా
అదే రధం......

జగతి జీవనము నూతన యుగలక్షణ శోభితమై
అందిన మన ఆదర్శపు మిన్నులు తన తెన్నులుగా
ఉదయకాల రాగమాల మన చరిత్ర స్వర్ణయుగం !
పంచిన కాంతుల సంపద వంతులు, చేమంతులుగా
అదే రధం......

— కుందుర్తి

# 15 ఆగస్టు

స్వాతంత్ర్యంబన సఖుడా !
స్వైరవిహారంబు కాదు,
　　స్వైరవిహారుల కెప్పుడు
　　స్వాతంత్ర్యం బచ్చిరాదు.
బాధ్యత యెరుగని స్వేచ్ఛ
బానిసత్వ లక్షణము
　　బాధ్యత యెరిగిన స్వేచ్ఛ
　　స్వాతంత్ర్యపు రక్షణము.
విచ్చలవిడి వర్తనమే
స్వేచ్ఛా స్వాతంత్ర్యంబని
　　భావించెడివారి నెవరు
　　బాధ్యత గల పౌరులనరు.
పాడికి కాడికి అందని
దూడలు కోడెలు రైతుకు
　　వశముగాని పసరాలు
　　పశుధనము కాజాలవు.

పనిదొంగలు, పరభృతులు
ప్రతి పదేండ్ల కొక్కసారి
జనాభాలో చేరువారు
జాతిధనము కాజాలరు

పచ్చని చేలను మేయుచు
విచ్చలవిడిగా తిరిగెడి
దొంగ గొడ్లు ఏరికైన
బెంగ, బెడద, చేటు కూర్చు.

నీతియుక్తమైన శ్రమము
చేతకానివారందరు
జాతిధనము దిగమ్రింగెడి
'బాతాఖానీ' నేతలు.

రాజకీయములు 'సట్టా
బాజా'రనుకొనువారికి
చేజిక్కిన కాసు కాని
కాజేయుటె కర్తవ్యము

ఉమ్మడి సంసారంబున
నమ్మకంబులేనివారు
నమ్మకద్రోహము తప్పని
నమ్మరు, నమ్మించుతారు.

విత్తనాల గింజలతో
విందు లారగించువారు
విత్తి, పెంచి, పండించెడి
చిత్తవృత్తి మెచ్చలేరు.

నూటికి ఎనుబదియైదు
మేటికాపు లుండు పుడమి
కూటికి బిచ్చము ఎత్తుట
లోటె గాదు, సిగ్గుచేటు.

ఆర్జించెడివారు లేక
ఆరగించువా రుండిన
అమరతరువు, కుబేరాస్తి
ఆగలేవు, అంతమొందు.

విచ్చలవిడి వర్తనంబు
విశృంఖల జీవనంబు
సంఘ జీవితమున కెపుడు
సంక్షోభము, సంహారము.

తలలను తాకట్టుపెట్టి
తనువుల తనువులు తీరగ
బ్రతుకుట మానవమాత్రుల
బ్రతుకెప్పుడు కాజాలదు.

పక్షపాత బుద్ధితోడ
కక్షలు సాధించినపుడు
గౌరవప్రద జీవనంబు
గగనకుసుమమై పోవును

తంజావూరీ రాజుల
తరహా లాలస గలిగిన
లాంఛనాల ఓహోలే
రమ్య నవ్య కవిత్వాలు.

శక్తిమంతులగువారలు
శక్తివంచనంబులేక
శ్రమల కోర్చునాడు గాని
జాతిధనము పెంపొందదు.

స్వాతంత్ర్యంబన సఖుడా !
స్వైరవిహారంబుకాదు
స్వైరవిహారుల కెప్పుడు
స్వాతంత్ర్యం బచ్చిరాదు.

— కాళోజీ

## అభిసారికా !

ఆగవె
అభిసారికా !
ఆగవే !
సాగలేదు సంధ్యా సుందరి స్యందనము
మ్రోగలేదు యామినీ శింజినీ నిస్వనము
ఆగవె
అభిసారికా !
కరగిపోయినవి
పెరిగిన నీడలు
రాలిపోయినవి
వాడిన పూవులు
కలకల నవ్వవు
కల్హారమ్ములు
తళతళలీనవు
తారాపంక్తులు
ఆగవె
అభిసారికా !
........................

సాగవె
　　జ్యోత్స్నాభిసారికా !
　　　　సాగవే !...
కనులు విచ్చినది
కలువ కన్నియ
వెల్లివిరిసె నదె
వెలుగుల రోహిణి
పూలు నవ్వినవి
వాలు జడలలో
సఖుని పిలిచినది
యువ చకోరిక
సాగవే
　　జ్యోత్స్నాభిసారికా !
సాగుచుండె
　　శారద శశాంక రోచిర్వితానము
మ్రోగుచుండె
　　రాకారాగిణి కంకణ నిక్వణనము
సాగవే
　　జ్యోత్స్నాభిసారికా !
　　　　సాగవే...

—ఉషశ్రీ

## ప్రౌఢ నాయిక

అర్ధవలయికాకృతిలో ఆపాన్పున నున్న నీవు
శంభు జటాజూటముపై శశిరేఖగ దోచినావు.

నీ ప్రసన్న నిటలముపై నీల తిలక బిందు వొప్పె
స్మేర సరోరుహాముమీద మిళిందమ్మువోలె ప్రియా !

వ్యజనవాయుకంపితమై అలక లలముకొనెడి ముఖము
చిరుమబ్బులు గ్రమ్ముచున్న శీతాంశువువోలె దోచె

నిదురలోన నొత్తిగిలిన నీదేహము గోచరించె
భాస్కరుండు తొలగిచన్న పశ్చిమార్ధ గోళమట్లు

తదుపరి తోచితివి మరల తల్పముపై వెల్లకిలగ
శయనించిన నీవు శేషశాయి మూర్తివోలె ప్రియా !

అవల నిర్నిమేషముగా నాలోకనచేయు నాకు
వటదళ శయనాంతరితునివలె దోచితి వొక్క త్రుటిని.

స్నిగ్ధంబౌ నీకపోల సీమమీద నలతిముద్దు
పెట్టి నిన్ను మధురముగా ప్రియా, లేపదలచినాను.

సంకోచమువలన నవల సరోజమ్ము బోలు పాణి
ముద్దుపెట్టుకొనగ ప్రియా ముందు కడుగు వేసినాను.

కాని నీదు పదపద్మము కదలుట గనుగొన్న పిదప
కరముతోడ తాకి లేప కాంక్షించితి కొంత ప్రియా !

వాలి యొక్కమారు తనూవల్లిమీద మృదుచుంబన
పరీరంభణములు చేయ భావం బొదవినది ప్రియా !

అంతరంగమందు మాత్ర మటు లొనర్చి మంథరముగ
వెనుకడుగులు వేసికొనుచు వెడలిపోయినాను ప్రియా !

ఈక్షణములు మూసియున్న, ఎట్టు లున్న నెచట నున్న
నీశయానమూర్తి మనోనేత్రవర్తి సుమీ ప్రియా !

—శివశంకరస్వామి

## బ్రతుకున కర్థం ?

ఏమిటోయి నీ బ్రతుకు విచిత్రం !?
ఏమిటోయి నీ బ్రతుకున కర్థం !?

తల్లక్రిందులా తపస్సుచేస్తూ
తియ్యని కలలు కొల్లలు గంటూ
గెలుపంతా నాదే నంటూ
ఓటమి యంతా దేవుని దంటూ
సంతోషానికి జానెడు లేస్తూ
సంతాపానికి మూరెడు దిగుతూ
పడుతూ లేస్తూ పరుగులు తీసే
అంతులేని యీ ఆటల పోటీ ?

ఏమిటోయి నీ బ్రతుకు విచిత్రం !?
ఏమిటోయి నీ బ్రతుకున కర్థం !?

శిఖరాలను చూస్తూ చూస్తూ
కుప్పిగంతులేస్తూంటావ్
మహాత్ముడంటూ ప్రజలు మూగితే
మసి పూసి మారేడంటావ్
అనాధులకు నాధుడనంటూ
ఆత్మవంచనకు పాల్పడుతూంటావ్
స్వార్థానికి అడ్డంవస్తే
సత్యానికి లంచాలిస్తావ్
స్వధర్మాన్ని ఖూనీచేస్తూ
హక్కులకే అర్జులుచాస్తావ్
స్వార్థానికి పరమ ప్రమాణం
పడి లేచే మానవలోకం !

ఏమిటోయి నీ బ్రతుకు విచిత్రం !?
ఏమిటోయి నీ బ్రతుకున కర్థం !?

ధనవంతుల ఖండిస్తూనే
ధనరాసుల పూజిస్తూంటావ్

'సత్యమేవ జయ'తంటూనే
సత్యానికి గోరీ కడతావ్
శాంతిమాత నేనే నంటూ
చురకత్తులు నూరేస్తుంటావ్
కుల, జాతులు బూటకమంటూ
కుల తత్వాలను రేపెడుతూంటావ్
మహనీయుల నీతులు చెబుతూ
మహా నాటకా లాడేస్తుంటావ్
ఓటు హక్కు నీదేనంటూ
ఓటిమ్మని ఒత్తిడితెస్తావ్
స్వార్థానికి పరమ ప్రమాణం
పడి లేచే మానవలోకం!!

ఏమిటోయి నీ బ్రతుకు విచిత్రం!?
ఏమిటోయి నీ బ్రతుకున కర్థం!?

పసిఫిక్ సంద్రపు లోతులు మీరే
హృదయసాగరా లన్వేషిస్తావ్
ప్రచండ మారుత శక్తిని మీరే
ప్రబల శక్తితో బ్రతకాలంటావ్

అసాధ్యమంటూ లేనేలేదని
అన్నిటికీ ముందడుగేస్తావ్
రవి కంటే కవియే గొప్పని
విశ్వాన్నే కావ్యంచేస్తావ్
అత్యద్భుత సృష్టిని చూచి
అంతు తెలిసి తీరాలంటావ్
చావు బ్రతుకుల తీరులు చూచి
మర్మమేమిటని మధించబోతావ్
భగవంతుని లీలలు చూస్తూ
భగవంతుడ నేనే నంటావ్
తరచి తరచి అన్నీ చూచి
తెలియరానిదీ మాయంటావ్

జ్ఞానానికి పరమ ప్రమాణం
పడి లేచే మానవలోకం !

ఏమిటోయి నీ బ్రతుకు విచిత్రం !?
ఏమిటోయి నీ బ్రతుకున కర్థం !?

— సిద్ధాంతి మల్లికార్జునం

## భగ్నహృదయము

కంటికొలకుల మంటలేమే
కామినీ వలదింక లేవే,
కాలమిదియే కాదు మనలకు
గతులు లేవింకన్.

నేటిలోకము బూటకమ్మది,
నీటుచూపెడివారి సొమ్మది,
చోటులేదిట సొబగు కనమెట
చేటు తప్పదికన్.

కొండలెన్నో కరగిపోయెన్,
గుండెలోని అగ్నికీలలు
చండతర బాధాత్మకములై
మండుచున్నవిగా !

నేడు మనదెస జూడదెవ్వడు
లేడు మనలను గౌరవింపా
ఒకరికొకరై సకలమున్విడి
ఒదిగి పోదము రా !

భగ్నహృదయవు భావనాశని
పాతములలో పాడు జీవన
మోర్వలేమే, ఓర్వలేమే
ఓర్పుటది పోయెన్.

నిండువేడుక పండువెన్నెల
నిర్మలామృత నియతజీవన
మాటపాటల నాడు దినముల్
అస్తమించెగదే.

అందమై ఆనంద మిచ్చెడి
సుందరాకృతి ప్రకృతిలోనన్
లీనమౌట కనూన సంతస
మానసంబులతోన్.

ఉదయకాల సమీరవీచిక
ఉదయసంధ్యా రక్తిమంబున
శుద్ధచంద్రాతప సమాశ్రిత
శీతలాంశువులన్

ఏకమై మన శోకపావకు
భీరకత్వ మడంచివైచి
చీకుచింతయు లేక చిన్మయ
చిత్తముల నుందాం.

పదవె ప్రేయసి, పదవె పోదాం
వదలులోకపు గొడవ లింక
ఆదరింప ననాదరింపా
అందే ఆనందం.

—భద్రిరాజు

# వాడిన పూవులు

నవ వికసిత సిత దళముల
నవ నవోఢ కాంతులీను
మల్లీ ! వాడితివేమే !
మధురిమ వీడితివేమే !

భ్రమపడి మురిసితినోయీ !
భ్రమరము వలచిన దనుకుని
త్వరపడి హృదయము నిచ్చితి
ఎరుగక మర్మము కలదని

మధువును గ్రోలిన మధుపమె
విధురముచేసెను బ్రదుకును

ప్రాభాతారుణ రాగం
ప్రవహించే రక్తకాంతి
నించుకొనిన మందారమ
నీలిమ దాల్చితివేమే?
నీడల దాగితివేమే!

తెలతెలవారిన వేళల
కిలకిల నవ్వితినోయీ
వెచ్చని కోమల హస్తం
ముచ్చటగొని నన్నుచూచి
మృదువుగ తాకినదోయీ
మురియుచు కోరినదోయీ
విలువల నెంచక నే నా
వెచ్చని హస్తమె చేరితి
వెచ్చదనపు సోయగమే
తెచ్చెను నాకీ రూపం
విచ్చిన పూవని నన్నటు

మెచ్చిన హస్తము నన్నిటు
వాడిన పూవిది వలదని
వీడెను నన్నీ నీడల.
విప్పారిన నీ దళముల
విస్ఫారిత ధవళ కాంతి
ఆకాశపుటంత ఎత్తు
అందుకొనినదో ఏమో!
చందమామ అందమంత
అందుచేతనే ఏమో!

కొలనులోని తపస్వినీ
కలలగనే మనస్వినీ
కొలను దాటి కలల విడిచి
తలవాల్చితి వేమి కతమె!
అంత అంద మంతలోనె
నెందు వోయెనే కలువా!
ఉత్తుత్తనె ఎందు కిటుల
ఉరలిపోయినావె కలువా!

అమావాస్య దాటగానె
వస్తాలే తప్పకుండ
అన్నాడా చందమామ
అంతవరకు ఎదురు చూచి
అదిగో వస్తున్నాడను
కున్నా నంతలోనె చేసి
కొన్న కర్మమేమొ! పాడు
మబ్బులొచ్చి నా స్వామిని
మరుగుపరచి, నా మదినే
నల్లపరచె నే నేడ్చితి
నా స్వామియు ఏడ్చెనేమొ ?
వర్షమనిరి తుఫాననిరి
వడిగాలుల సుడిగాలుల
ఇటు వచ్చితి, నా బ్రతుకే
ఇటులాయెను, నా ప్రణయమె
ప్రళయమటుల నా వలపే
ప్రమాదముగ పరిణమించె.

—పి. శ్రీదేవి

# భయపడినవాడు

ఆకుల్లేని చెట్లమీద రేకుల్లేని పూలుపూసి
ఎప్పుడో పండ్లవుతాయని
ఎంతకాలం వేచి వుండేది!
ఎన్నాళ్లు పాపాన్ని భరించేది,
ఆశను వరించేది?

శూన్యమైన గగనంలో నాణ్యమైన మబ్బులు పట్టి
ఎప్పుడో వాన కురుస్తుందని
ఎంతకాలం వేచి వుండేది!

ఎన్నాళ్ళు తాపానికి తల ఒగ్గేది
బాధల ఎండలో మగ్గేది ?

వీధుల్లోపడి తిరుగుతున్నప్పుడు
ఎండలో బ్రతుకు సలసల మరుగుతున్నప్పుడు
మర్రిచెట్టు నీడ
మనసార రమ్మని పిలుస్తుంది
అమ్మో ! అక్కడికి వెడితే
హతమై పోతా ననిపిస్తుంది.

నడబజార్లో నుంచున్నప్పుడు
నలువైపులా చీకటి పొంచున్నప్పుడు
నగరం నన్ను కౌగిలిస్తుంది
అమ్మో ! ఆ విషకౌగిలిలో
హతమై పోతా ననిపిస్తుంది.

ఎలెక్ట్రిక్ తీగమీద యిరుక్కున్న గాలిపటం
అమ్మో ! ఎంత పొడుగాటి పాము !
గాలికి పడగ ఆడిస్తోంది
దానిబారినుండి తప్పుకోలేము !

ఎదురుగా వస్తున్న మోటారుకారు
ఎందరి గొంతులో కోసిన బాకు!
ఇప్పుడు డ్రైవర్ నిషాలో లేడని
ఏమిటి నమ్మకం నాకు?

కారడవుల గిరిగర్భాల్లో నిద్రించే పులిగోళ్ళు
లభించటం సులభం కాదుకదా—
ఎందుకీ వేట?
కాలం కడలిలో నడుస్తున్న అనుభవాల ఓడలను
తుఫాను మన్నించదుకదా –
ఎందుకీ నీళ్ళబాట?

తీరాల దూరాలు చేరుస్తుందా
ధీరులు కట్టిన త్యాగాల సేతువు?
మనిషిలో మళ్ళీ కొలువు తీరుస్తుందా
జైలుగోడలు దూకి బైటపడ్డ హేతువు?

బ్రతుకు రోదసి మీద
పరుచుకున్నై చీకట్లు
భయం మెలివేసిన బ్రతుక్కు
లెక్కలేనన్ని తాకట్లు!

అర్ధానుస్వారాల, శకటరేఫల
ధృతరాష్ట్ర కౌగిలింతలు వదలించుకొన్న
విశ్రృంఖల గేయరచనలా
తలపులను సాగనివ్వదు, భయం
మనసంతా, క్రమ్ముకున్న చీకటి మయం!

పనికిరానిదాన్ని వదిలేసే
బలంలేదు —
గుండెలో చైతన్యంపట్టే
స్థలంలేదు.

నీమనసు రైలు పెట్టెలో
దొంగలున్నారు జాగ్రత!

ఆత్మలోలేని ఆనందం
ఎక్కడ వెదికినా దొరకదు
వెలుగులోలేని సౌందర్యం
చీకట్లో అసలు దొరకదు.

భయపడినవాణ్ణిచూసి వెకిలిగా నవ్వే విశ్వం
భయపడనివాడి బానిస!!

—కుందుర్తి

## మధురిమలు

నాదేవి కరుణించెనో...
నాలోన
మధురిమల నూరించెనో!! నాదేవి
తొలినాడు ముగ్ధయౌ తరుణి లే జూపులే
తపియింపగాజేసి తపియింపగాజేసి
తియ్యు తలపుల రేపెనో
హృదయాన
కుసుమాల వెదజల్లెనో. నాదేవి

పెండ్లిలో పదివేల పరుల కన్నుల యెదుట
ఎఱగన ల్లేకాంత మెఱుగ జేసితి నహో
హృదయాలు ఉడుకె త్తెనో...
ఉరుములూ
మెఱుపులే పరువె త్తెనో. నాదేవి

శశికాంతమీను చల్లని తెల్లకాంతిలా
ఆనందమే కరగి యతికించినట్టులా
మొగము గుండెల హత్తెనో...
హృదయాన
కమలాలు కదలాడెనో. నాదేవి

సంగీతనాట్యపు కళా సేవనములలో
నా కవిత్వపు ఝరీ నవ్యవాహినులలో
కాలి మువ్వలె కదలెనో...
గదియంత
కనకవర్షమె గురిసెనో. నాదేవి

భావంపుటౌచితిని భణితి పలికేవేళ
విరహవేదన విచారించి వద్దనువేళ
కంట బాష్పమె రాలెనో....
అమృతంపు
వానచినుకే జారెనో నాదేవి

—రామచంద్రరావు

# మనమే

వరమీయని వేలుపులం
అణగారని మంటలం
పొగచూరిన బతుకులం
చదవని కావ్యాలం
అతకని వాక్యాలం
శోభించని శయ్యలం
రాణించని ఫణతులం.
వినిపించని గీతాలం
కనిపించని నేత్రాలం
పదాలకందని భావాలం
పెదాలకందని మధురాలం

త్రాగని మద్యాలం
వాగని వాద్యాలం
మీటని తీగెలం
చాటని ప్రతిభలం
పేడిమూతి మీసాలం
తిన్నయింటి వాసాలం
కోరకంటి రోషాలం
వారకంటి వేషాలం
భజనచేయు భక్తులం
బాధ్యతా విముక్తులం
శృంఖలా బద్ధులం
సాధించలేని పరమార్ధాలం
అర్ధంకాని నిరర్ధకులం
గవ్వకుగాని నిర్ధనులం
అర్ధంకోసం అర్థులం
వెలుగుల్లో నీడలం
నీడలో వెలుగులం
మేడలోని చిలుకలం
పేడలోని పురుగులం

గడచిన నిన్నలం
నడుస్తున్న నేడులం
మరి రాని రేపులం
మరపురాని మాపులం
ఎలక్షన్ మానిఫెస్టోలం
మాకుకాదు పదజాలం
మా దగ్గరికేరాదు ఛందం
అయితే నేం, గీతాల్ రాసేస్తాం
బలే మొండి శిఖండులం
ఇంటలేదు తండులం
మొహంవాచిన తాంబూలం
దొరకని దౌర్భాగ్యులం
ఇదిగో, యిటు చూడవుటోయ్
పొట్టైతే ఖాళీ భాయ్
చుట్టైనా యిటు పారెయవోయ్
గుక్కైనా తియనియ్యవోయ్.

—వేమరాజు నరసింహారావు

## ఆణిముత్యాలు

సంగీతంబును, సాహితీ గరిమయున్,
　　　　చక్కందనమ్మున్, లసత్
శృంగారంబును, సద్గుణంబులును, సౌ
　　　　శీల్యంబు, నమ్రత్వమున్,
మాంగల్యైక సుశోభయున్ గలుగు భా
　　　　మన్ భార్యగాఁగాంచు పు
ణ్యాంగుండే కవియైన నింకతని భా
　　　　గ్యం బెన్నగా శక్యమే !

★ ★ ★

ముకుళరుచుల్, సహస్రదళ
　　　　ముల్ గల పద్మము భాస్కరుండు హృ
ద్వికసన జేయుచున్న ఫణి
　　　　తిన్ తన లెక్కల వేవిధమ్ములన్
ప్రకృతిని జూపి భాస్కరుడు
　　　　పాఠము నేర్పెను ప్రత్యుషమ్మునన్
ప్రకటిత లీల లీలకు న
　　　　వమ్ముగ బుద్ధి జవమ్ము నొందగన్

★ ★ ★

మెరుగుం బంగరు మేనికాంతి కనువౌ
　　మేల్చీరయున్, చంద్రు న
క్కర వారింపగలట్టి నెమ్మొగమునన్
　　కళ్యాణపుం బొట్టు చ
క్క రహింపన్ పసుపుం హొరంగు మధుప
　　ర్కం బొప్పగా - పెండ్లి కూ
తురు లీలావతి యొప్పె బంధువులు సం
　　తోషాబ్ధి నుప్పొంగగన్.

★ ★ ★

పుత్రుడు కాని లోపమును
　　భూపతిచూచి గ్రహించి, పుత్రికన్
పుత్రకుడంచుఁ జాటె తన
　　ప్రోలున సత్యముదాచి ; రుద్రమన్
పుత్రుడె యంచు నెల్ల జన
　　ముల్ తలపోయగ తాను నల్లె తత్
క్షాత్రముఁ జూచి నమ్మను గ
　　దా, జనకుం డపుడప్డు వింతగా !

★ ★ ★

—ఆదిలక్ష్మి

## మృత్యునిరాసము

చిన్నవాడనై నే వికసింప నెడద
నిపుడె కోరిక లుదయించె ఈ జగమ్ము
పై మమతగల్గె బ్రతుకుపై భ్రాంతిపుట్టె
ఆగు మాగుమో మృత్యువా ఆగుమయ్య

ఎడద యానంద సౌందర్య మెఱుగలేదు
పీడకలవోలె బాధ వెంటాడె నన్ను
గాలిసోకిన భీరువువోలె నేను
నిలచినాడ నిట గతమ్ము తలచికొంచు.

ఆరిపోయెను బాధామహాగ్ని యిపుడ
ఆశయను జ్యోతి కిప్పుడే యందె వెలుగు
వెలుగునై యొక్క క్షణమేని మెలగనిమ్ము
ఆగు మాగుమో మృత్యువా ఆగుమయ్య

ఈ నవాయాత మధుమాస మీ ప్రఫుల్ల
యౌవన వనాంత మధుర విహారము మన
సార చవులూర చూడకే చనుట యెట్లొ
ఆగుమాగుమో మృత్యువా ఆగుమయ్య

జీవితమ్ములో కమ్మని తావులొసగు
తావులంజేర సౌఖ్య సంతాన శాఖి
శాఖికా శీతలచ్ఛాయ శాంతి యొదవె
ఆగుమాగుమో మృత్యువా ఆగుమయ్య.

—మురయా

# నన్నెచోడుడు

జాను తెనుంగునన్ నవ
రసస్ఫురితమ్ముగఁ జిత్తపద్మ మిం
పూనఁగఁజేయు సత్కవన
యోగ్యతగల్గిన యట్టిసత్కవీ

శ్రీనిధులైన శైవకవి
　　శేఖరులం దొకరుండ వౌటచే
నీ నుతి నన్నెచోడ!
　　హావణించినవేడుక నేనొనర్చెదన్.

జంగమమల్లికార్జునుని
　　సత్కరుణామృత దోహదంబునన్
భంగము వొందకుండు
　　కవనవ్రతతీఫలమై తెలు... ..
సం గయిసేయు నీవిమల
　　షణ్ముఖజన్మకథా ప్రశంసఁ బే
ర్మిం గొనిచేయఁగావలదె
　　శ్రీవిలసిల్ల సభాంతరంబులన్.

కమ్మనిజాను తెన్గు
　　నుడికారముసొంపు, మనోహరంపు భా
వమ్ముల పెంపు, క్రొత్తలయి
　　ప్రౌఢిమ నించెడుకల్పనాళి, హ్యా

ద్యమ్మగువర్ణనావళి
యుదారకథారచనాప్రశస్తి ని
త్యమ్మను తావకీన
కవితాపటిమ న్వెలయింపనొల్లవే ?

శ్రావ్యములైనకావ్యము
లసంఖ్యముగారచియించి సద్యశో
దీవ్యశరీరముల్ జగతిఁ
దేజరిలన్బొగడొందు తొంటి స
త్కావ్యులలోన పూజ్యపద
గౌరవముం బరిపుల్లకీర్తి సం
భావ్యతఁదాల్చి దివ్య
విభవంబునవెల్గుము రాజశేఖరా !

ముట్టినదాది కావ్యము
సమూలముగాఁబరియించి కాని, యే
పట్టుననైనఁ దీసి చదువం
దొరకొన్ననుగాని వీడఁగాఁ

బుట్టునె బుద్ధి యిట్టిది
యపూర్వము , మున్ను తెలుంగు బాసలో
నిట్టియమోఘకావ్య
ఘటనైకమహత్త్వముఁ గల్గ నేరికిన్ ?

తెనుఁగుపదంబుపొందికకుఁ
దిక్కనకంటెనునీవు, దివ్య ని
స్వనమునుఁబోలు సత్కవితఁ
బండితమల్లయ పాలకుర్కి సో
మనయునుఁ దొల్లి తెల్పి
రసమానమహాంధ్రకవిత్వరీతులన్
ఘనులు విమర్శకాగ్రణులు
గైకొనరేలొకొ ? నేఁడు వారినిన్

చదువగ నింపునింపుటకుఁ
జాలినశైలిని లేదటంచు నె
మ్మదినొకయూహ సేయుచు
విమర్శకులై తనరారువారె నీ

మృదుమధురోక్తిగుంభనల
మెచ్చరు ; మెచ్చిరె యయ్యముక్త మా
ల్యద రసదృష్టితోడ
వినుమా ! సుకవీంద్ర ! రసజ్ఞ శేఖరా !

నీకావ్యము శృంగార ర
సాకరమై, సకలసత్కళాకరమై, మో
దాకరమై, లక్షణశో
భాకరమై వెలయుఁగాన నభినందింతున్.

లలితపదబంధురము ను
జ్జ్వలభావరసాభియుక్త పాండిత్యకళా
కలితంబౌనీకావ్యము,
తలమానికమగుచు నాంధ్ర ధరణిని వెలయున్.

చెలువగుపలుకుల నలరుచు
సలలితభావములఁ గవనచాతురిమీఱ
వెలయఁగఁజెలఁగిన కబ్బము
పలుమారునుతింపఁదగదె పాండితిమీఱన్.

—నిడదవోలు

# నేరస్తులు

జైళ్ళలోన, దీవులలో, కాలివేళ్ళ సంకెళ్ళలో
ఊరవతల కసువుల్లో, కలలెరుగని కనురెప్పల
ప్రతి నరమూ చౌర్యంతో
ప్రతి మనసూ ద్రోహంతో
అహరహము అవినీతికి

కల్లుముంత లీ తీరులు
అది నేరస్తుల బారులు.

వారంతా నేరస్తులు, జారిన పునాది గోడలు
మానవుడాకలి తెలిసినరోజు
అమవాస్యలు పుట్టినరోజు
బ్రతుకు మాధురులు నంజినవేళ
క్రూరమృగం, రాక్షసుడు
నరహంతలు, నేరస్తులు—

బాగున్నది మనమెవరం ?
ఓగులేని తీర్పరులం—

శరీరమంతా చెడింది కనుకనె
వ్రణమందున కుళ్ళిన నెత్తురు
పెనువృక్షం ముదిరినపుడు
పండుటాకు బయటపడును.
మనకళ్ళ కనీనికలు
మన మనసుకు ప్రతిబింబాలు
మన గోరీలకు నీడలు
వారంతా నేరస్తులు—

భూమిలోని వూటజలం భూమవతల సముద్రమైంది
నీగళమె పతితమైన స్వరమిచ్చే తటాకమైంది
మన తాతల కద్దాలతో
మలిపించిన గోరీలో
తరచిచూడు నీవున్నావ్ !
నీ పుత్రుని చిరునవ్వుంది
మనం భూమి, వారు చెట్టు
మన స్తన్యం వారి బలం
వారంతా నేరస్తులు
మనం వారు, వారు మనం.

న్యాయం వరవడిలో గిరిగీచెడి తీర్పరులారా !
వేపపూత సౌందర్యం చేదును మరిపిస్తుందా ?
మన మంచికి ఆధారం అడుగునగల చెత్తకుండి
ఇది మనలో పేరుకొన్న చరితాత్మక విషజ్వరం
దొంగ చెయ్యి ఖండించడమా
దానితల్లి దొరలజేబు
వ్యభిచారిని శిక్షించడమా
ఆధారం వివాహ వేదిక
విద్రోహం చింతించడమా
మన సంస్కృతి పండిన పంటలు.
మన బ్రతుకులు ముండ్లపొదలు
కాలెయ్యకముందే మంచి
మన తరాసులన్నీ తప్పులు
వర్తుల బిందులనుండి సమరేఖలు గానేరవు
మననేరం తెలిసి పలుకుదాం.
మనమంతా నేరస్తులం !
మనమంతా నేరస్తులం ! !

— అబ్బరాజు శర్మ

## రాధా దేవి

కప్పుకొన్నది పీత కౌశేయవసనమ్ము
నిజభుజమ్ములమీద నీల కుచబంధమ్ము
బిగియించినది రమ్యపృధులవక్షము చుట్టు
తురుముకొన్నది లేత తులసీదళాలతో
అతసీకుసుమమాల వితతకైశికమందు
కేల ధరియించినది లీలారవిందమ్ము.

స్వస్తికాకారాన సాంద్రగోరోచనా
తిలకబిందువు తీర్చి దిద్దినది ఫాలమున
కార్తస్వరప్రభా గండయుగ్మముమీద
మసృణకస్తూరికా మకరికాపత్రముల్
రచియించినది భూరిరమణీయరేఖలో.

ఆనాభితలలంబి యౌ హేమభాండాది
హారసంతతి ఈషదాందోళనము చెంద
కరసరోరుహరత్న కంకణారవముతో
హాటకాంగద తులాకోటి శింజితముతో
మేఖలాకింకిణీ మృదులనిక్వాణంబు
చల్లగా మిళితమై శ్రవణోత్సవము సేయ
ఏకాగ్రదృష్టితో నేగుచుండెను రాధ.

బాలభాస్కరకిరణ పటలస్నపిత యౌచు
కనకపుత్రికవోలె క్షణముతోచెను రాధ
మరు నిమేషములోన మణిగణప్రభలతో
శాతకుంభార్చితో సంశ్లిష్టగాత్రయై
జ్యోతిర్మయీదేవి భాతి దోచెను రాధ!

— శివశంకరస్వామి

# రసక్రీడ

ఆకాశపు టారామము
నందలి సుందర పుష్పం
పూవులలోకెల్ల రాజు
పూబోడుల కయ్యె మోజు
అదే రాజు రాత్రి కెంతో
అదే మోజు నాజూకది
అతి విశాల మతి విశుద్ధ
మది సుధా ప్రపూర్ణసుమం !
మల్లెకాదు, స్నిగ్ధకీర్తి,
చల్లని కితకితల ప్రోవు !!
అమెరికా ప్రసిద్ధనారి
ఆశదెల్ప నదే క్షణం
రషియా సుందరి కోరిక
ప్రకటించిన అర్ధ క్షణం,
పయనమయ్యె నింగిజేర
రయమున శూరంమన్యుడు !
సుమముదెచ్చి శ్రమముజెప్పి
సుదతి మనము బట్టుకొనగ !!
భారమనక మోసినాడో
నారీమణి ముద్దుకోర్కె !!!

— వెంకట శివరావు

## రావోయి !

రావోయి రావోయి రావోయి చందురుడా !
ఆలసించిన ఆశాభంగము ఆలోచింపక
అరుదేరుము వేగమే
మేఘమాల నిను మూసినదేమో- తారను వెతుక
నరిగితివేమో నీ జాడను తెలియక చూచుచుంటినిటు
రావోయి రావోయి చందురుడా !
కోయిల లవిగో కూయుచుండెనూ
పవనుడు అడుగో వీచుచుండెనూ
ఏలా ? ఇటురావేలా చందురుడా !
విసిగి విసిగి వేసారితివేమో
కారుమబ్బులే క్రమ్మినవేమోమరి
నీయానందమె నా యానందమని ఎంచితి మది
ఏలా ఇటు రావేలా చందురుడా !
రావోయి రావోయి రావోయి చందురుడా !

— చిల్లర సుబ్రహ్మణ్యం

## రెండుకళ్ళ పన్నెండుచేతుల నాయకుడు

మరీ మంచివాడు కిరీటంలేని రేడు
మరీచికలను వేటాడు
సరీసృపాలకు సైతం జోలపాటపాడు
అతడే పన్నెండు చేతుల నాయకుడు.

తెల్లని మంచితనం అతని శత్రువు మొదట
అచల్లని ఉల్లము మానవతా విజయహేతువు తుదకు
అది పడిలేచిన మనిషి భవిష్యత్ సుఖానికి సేతువు ఎప్పుడూ

బ్రతుకు క్రతువున ఆతడు కాలుతూవున్న సమిధ
పరిసరాల్ని కాంతితోనింపే వెలుగు ప్రమిద

సముద్రం కట్టతెగి పొంగినా
అందరూ అన్యాయం చేసినా
క్షణం చలించని (పాల్) ముని

ఆమనీషికి జీవితంపై చెదరనిగురి
మరొకళ్ళ సుఖంకోరి
తానే తగిలించుకుంటాడు ఉరి

ఖడ్గమృగం అస్త్రసన్యాసం చేస్తుంది అతని సమీపాన
పుట్టంధుడు ద్యుమణిని చూస్తాడు ఆకుటీర ప్రాంగణాన

ఎడారిలో పువ్వులు పూయించడం అతని మహోద్యమం
మహిషంచేత వేదం చెప్పించడం అతని అనవద్య నిర్ణయం
వేయినీతులకు సరి అతని మరణకారణం

— గోపాలచక్రవర్తి

## వసంత గీతి

అతి గహనమ్ములౌ శత
　　శతాబ్ద పథాల నతిక్రమించి యీ
ఋతువు మొయిళ్ళలోఁ బరుగు
　　లెత్తెడి పూల రథమ్ముమీఁద సు
స్మిత సుమనోజ్ఞవై అధివ
　　సించిన ఓ ఋతురాజ్ఞి! నీకు స్వా
గత మరుదెమ్ము—రమ్ము
　　ననకారులఁ గుంకుమపొళ్ళ దారులన్.

శ్రమపడినట్టి దొక్క-
 తరుజాలమెకాదు—చరాచర ప్రపం
చము శిశిరమ్ము నందు
 నగచాటులు పడ్డది రమ్మహో వసం
తమ ! సుమనో మనోజ్ఞ
 హరిదంతమ ! చెట్ల మొగాలపైని ము
చ్చెమటలువోని యీ యివము
 చెమ్మలనద్ది సమాశ్వసింపుమా !

దివి కెగిరిపోవు ప్రతి రజోలవమునకును
అలవరింపుమ యీ భువనాభిలాష !
కన్నె ప్రాయంపు చిన్ని మొగ్గలకునెల్ల
గఱపుమా నవజీవనా కలితభాష !

నవ కిరణ తంత్రుల రహించు భువనవీణ
నాలపింపుము నీవు హిందోలగీతి !
తలలు పంకించు పూలపై నలి కులమ్ము
శ్రుతి మధుర మందమంద ఝుంకృతులు సేయ.

— ఉత్పల

## వాసంత స్మృతి

నవచూతావలి పల్లవింపగ
వసంతప్రేమచేతన్ దిగం
త వనాంతంబుల మత్తబంభరము
చింతాగానముల్ సల్పగా
చివురుల్ వెట్టె ప్రసూనకోమలసుధా
స్నిగ్ధాత్మ సీమ౯ దురం
త వియోగవ్యధ నాకు మిత్రమృదు
హార్దంబుల్ స్మృతిం బాడుటన్.

మనమెక్కు౦జెలికాడు మన్మధునకు౯
మాధుర్యపుం బ్రోక పు
ష్ప నవోఢా హృదయావలంబనపు
సౌభాగ్యంబు శారీపికా
శి నితాంతార్ద్రి మనోహరశ్రుతుల
కేలీవాస మీచైత్రు డా
య్యన వెంటం గొనివచ్చె దుర్భర
వయస్యాపూర్వశోకస్మృతుల్.

తరుగుల్మాళిని భవ్యశోభలను
సౌందర్యాంబుధిం దేల్చి పు
ష్ప రమాకాంత మరుత్పరంపర
ననంతాచక్ర మామోద వా
గుర దోగింప వెలుంగు నీసురభి
నాకున్ దివ్యమందార పు
ష్ప రసామోద సహోదరంబు
లగు భావశ్రేణి గల్పించెడిన్.

శిధిలంబై గతజీవమౌ జగతి
నుజ్జీవంబు నొందించు మ
న్మధ మిత్రుం డెపుడెప్డు నీ ప్రకృతి
కున్మాదంబు గావించుచున్
పృధివిన్ రూపము నొందు నప్పుడు
హృద్వీధిన్ మరిన్ నూతన
వ్యధతో నూతనరూప మొందును
వయస్యానూన దుఃఖం బికన్.

— నోరి

## వెనుకటి పద్యములు కొల్చి

రూపుమాత్రపు పూ లెన్నొ రూపు మాసి
పోయినవె కాని పిందెపూల్ పుట్టబోవు.
పిందె లెన్నియొ నాశమ్ము నొంది కాని
పూర్ణఫల మొండు నిలవగా బోదు లతను

వాతవశమున చిందరవంద రగుచు
అభ్రశకలమ్ములు తొలంగి నంతమీద
అమృతధారలు చిల్కు మేఘములు నిలుచు.

బలిమి సేనాముఖమ్మున నిలుచుభటులు
వీరనాకమ్ము నొందిన వెనుక గాని
సంగరంబున సంపూర్ణజయము లేదు !

—నోరి

# శతపత్త్రము

౧

ఒడలు పసిడి చాయ హాొయలెల్ల బయలుగా
సీమ చీరకట్టు చిన్నదాని,
చేదుకొానుట బదులు చేదుగా చూచెను
వడుకునూలు కట్టువాడు ప్రియుడు.

౨

ధవళిమమ్మైన కట్టుదంతముల సొాగసు
రంగువేసిన కురుల హారంగు మెఱపు
కాడు-సరసుండు బింకమ్ము తోడ చూడ
చాన నవ్వుచు శుష్కకాష్ఠమ్ము విఱిచె.

౩

నాగ కన్యవు తొాయ్యలీ! నాకు దక్కి-
తీవు-నీ యొంటిపాటు ఎంతేని లెస్స!
అనుచు చేయడ్డమిడిన ఒయ్యారి నవ్వి
పాపరాజ్యమ్ము నీదిరా! ప్రభువ అనియె

౪

చేరవచ్చు వాని చెంప పెట్టుగ కొట్టి
తోడ చూచె జాలి తోడ చాన
చట్టు తగులు చోట జల యున్నదను మాట
నిజము; ఆమె యయ్యె-సజల నయన.

౫

చిన్ని నాకన్నె వయసు దోపిళ్ళ త్రావి
పుక్కిలింతలుగా, నేడు క్రక్కినావు ;
మనసు మెత్తని దానికి మరణ శిక్ష
న్యాయమే కాని-నీవు, నాయందు కలవు

౬

పాట వినుచుండ మూతలు వడెను కనులు
తెఱచినను మూసినను ఒక్కతీరె నీవు
కోకిలమ్మవు ; ఇదియు నిక్కువ మటన్న
చాన నయనమ్ములయ్యె కషాయితములు.

౭

మధురయందె కాదు మఱి వీడు వీడునన్
కలరు చూడ గోపికలు నిజమ్మ
వేణు వున్నచోటె బృందావనమ్మగు
రసము కలుగు లీల రాసలీల.

౮

ఎక్కుపెట్టుట తిగుచుట ఏయుటెంతొ
సమయహార మంచు ఆ పుష్ప సాయకుండు
పాశ వినియోగ సౌలభ్య బద్ధ దృష్టి
నీదు కేశమ్మె వరియించె నీలవేణి

౯

రాగమును పాడ నా కనురాగ మొదవు
తానమును పాడ సుకములో తాన మగును
పల్లవిని పాడ ఉల్లమ్మె పల్లవించు
ఏమిపాడెద వోసి! నా హృదయ వీణ.

౧౦

రెపరెపల నాడు నీదు వల్లియను చూడు
తేలిపోయెను నావైపు గాలి సోకి
పైదలీ! యన్న, తోడనే పట్టుకొనియె
డిల్లపడి, వల్లెకాక–గుండియనె బేల

౧౧

అంబర మ్మంటు కట్నంపు టాస చేసి
వీటి బుచ్చితి మన చిన్ననాటి చెలిమి
అంబర మ్మంటరాకు, మేనత్తకొడుక!
సంబరము చాలు! మాయింటి చాయరాకు.

౧౨

గృహమె స్వర్గమ్ము, ఇందె వసింపుమయ్య
నడువ పనిలేదు జంభారి నగరమునకు
పండముగ్గిన దిదిగొ! రంభాఫలమ్ము
సోమరసపీధి! మన్మనః ప్రేమపరిధి

౧౩

అలిగి పుట్టిల్లు పట్టిన పొలతి సంజ
మల్లెజడవేసి, మఱదలి పిల్లఁ జూచి
చిఱుమొగిలు రేక, యెడద, నంబరముఁ దోచి
అమ్మ! నీయన్న 'మంచివా' రనియె ఆచి

౧౪

అప్పుడే కుట్టుపనిదాని కాది యిచ్చి
కోరి కుట్టించు కొన్నట్టి క్రొత్తరైక
ఇదిగో! చెల్లెల, నీవె ధరింపు మనుచు
పైన బడవైచె సిగ్గరి పయసుకత్తె

౧౫

ఓసి! సింగారి చెల్లెలా! ఓసి పడుచ
బావ ఎంతటి తీయని వారు కాని
ముందుగా నీవె పుట్టక పోతివటవె!
నేనె వెనుకైన, క్రొత్తయే లేనె లేదు!!

౧౬

గట్టిగా తోడుపెట్టిన గడ్డ పెఱుగు
తీసికొనివచ్చు బొట్టెను తిట్టి మగడు
వట్టి జావైన, ఆ పాడు పడుచుపెఱుగు!
వాడుకను పెట్టినాడని వగచె భార్య

—పైడిపాటి సుబ్బరామశాస్త్రి

## శరత్సరస్వతి

సరస నీలోత్పలమ్ములై జలదమాలి
కాళి నీసేవ మున్గి, ఆత్మార్పణమున
లావునాశిల్లి, వాడి, వెల్లనయి పోయె ;
రమ్మ, శారద ! అమృత పాత్రమ్ము తోడ ।

బెంగను క్రాగియున్న గిరి
ప్రేముకు డంబుద కాంత బట్టి, నొ
వ్వంగ కవుంగలించి, సుఖ
వార్నిధి మున్గుచు తేలుచుండి—ఆ

యంగన లేచిపో— తివుచు
        నప్పుడు చిక్కిన చీరకొంగు నా
కొంగలబారు కాంచు మది
        గో! దిగుచున్నది పైరు మళ్ళపై!

ముసురు వానలలో చుట్టి మూలబెట్టి,
ఆరగట్టిన రైతుల యాస ఒనగ
ఆశలు వినిర్మలము లయ్యె; ఆకసమ్మ
చూర యిచ్చెను నీ పాలతేరు చూచి.

సిరికిన్ తోడువు, నీకు స్వాగతముగా
        చే లొప్పుగా పండి బం
గరు యెన్నుం గయిమోడ్పు టొదలల
        సాగన్ మ్రొక్కు, మా చంద్ర శే
ఖరు చూడామణి శోభ వౌటను
        త్రిలింగస్థాని కోర్వీ ధర
స్ఫుర దుద్య త్సుభగత్వ మెల్ల నదె
        నిన్ పూజింప మిన్నంటెడిన్!

వానలు, వరదలు, గాలి తు
పానులు చల్లారి, విప్లవానంతర తీ
ర్మానము వలె విశ్వము నీ
యానందోత్సవ పతాకమై తేరుకొనెన్ !

నీరాక నూహించి తీరిన కలకతో
కృష్ణవేణులు సుసంస్కృతము లయ్యె ;
నీ సంగతి దలంచి నెమ్మేను పులకింప
భూలక్ష్మి నవధాన్య భూషలయ్యె ,
నీ నవాలింగనశ్రీ నెంచి కల్హార
వనరాజి ఆనంద వార్ధులయ్యె ;
నీలో ద్రవించు రమ్యాలోచనము ముంచి
విశ్వాత్మయే పారవశ్యమయ్యె !

ఊహల చివళ్ళనుండి నీ వుద్ధృతముగ
లఘువు లిడుకొంచు దిగియెక్కిరాగ, నీ మ
హా రసోచ్ఛల చ్చంద్రికాహాసమందు
ఓ శరత్సరస్వతి ! జగ మోలలాడు !

శివుని తలమీది గంగ పెల్లెవసి శివునె
శివము త్రొక్కించి, వరదలై చెంగలింప—
శివుని సౌభాగ్యమెల్ల పిచ్చిలిన నీవు
శివుని ముంచెత్త, శివమయ్యె భువనకోటి!

నీ విజయమె అపరాజిత
నీ వేడ్కయె ధూపదీప నీరాజనముల్
నీ విభవమె పరిపూర్ణిమ
నీవె జగజ్జీవ జీవనేశత్వమవున్.

ఇది వైకుంఠము, వేంకటేశ్వరుడు ల
క్ష్మీశుండు కొల్వుండుటన్;
ఇది కైలాసము, మల్లికార్జునుడు ఆ
ర్యేశుండు చెల్వొందుటన్;
ఇది బ్రహ్మోర్వి, సరస్వతీ చరణ పం
కేజాతమై యుంట; లో
క దృగానందక మాంధ్ర; మిందు దిగుమా!
కల్యాణ తాదాత్మ్యవై!

— భీమన్న

## శంపాలత

తాప పరితప్తలోకాల దనుపుటకయి
కరగి నీరయిపోయెడి ఘనుడ వీవు
నీ సుధారస మానస నిలయమున వి
హార మొనరించు సౌభాగ్య మేరిదోయి!

చంచల నైన దోసమును సైచి
        కృపామతితోడ రాజ్ఞి గా
వించి, విశాల సుందర గభీర
        మనమ్మున నిల్పి నన్ను బ్రే
మించెదవోయి నీరద, నిమేష
        వియోగము నోర్వలేని నే
గాంచగ నిత్య నూతన వికాసము
        నీ ప్రణయార్ద్రమూర్తిలో

ఏ మహాపుణ్య ఫలితమో యింతకైన
ఎరుగనేరను ప్రియతమా యెల్ల వేళ
శాంత గంభీర తావక స్వాంత దివ్య
రాగ రస భోగమున ప్రేమరాజ్ఞి నైతి

శ్యామసుందర నీరద స్పర్శలోన
చంచలంబైన గుణమేదొ జలదరింప
ప్రణయ ఘంటారవంబుల పరవశతను
వలపు తలపుల తళుకులే కలచె జగము.

లోకమును గాంచు నుత్కంఠ నాకదేల !
నేను నీ నిండు గుండెలోనే వసించి
సరస మాధుర్య సార ప్రసారమందు
అంతరాంతర వర్తిని ననుసరింతు.

నీవు హృదయేశ్వరా నాదు నిర్మలాను
రాగ రసమూర్తివై నిండు రక్తితోడ
చంచల కచంచల స్థాన సౌఖ్య మొసగి
దిద్దుకొన్నావులే కూర్మిదేవిగాను !

— పిండిప్రోలు

## శూన్య పరిష్వంగం

మోయలేని జ్ఞాపకాల బరువుల ఒత్తిడి-
అంతులేని ఆలోచనల ఆవేశపు ఆవేగంలో
తప్పించుకోలేని తలపుల తపన - తీక్ష్ణతలో
ఆవేదన ఆరామంలో ఆకాశపు ఆలవాలంలో

అరగని తరగని పెరగని విరగని పిచ్చి ఊహల్లో
మానవ మస్తిష్క మహాంధకారపు మారుమూలల్లో
ముమ్మర వ్యాధులతో మూల్గులతో ముష్కరుల మూకల్లో-
కని విని ఎరుగని వింతవస్తువుల వైచిత్ర్యాల్లో-
మనుష్యుల జనన మరణాల ఔచిత్యాల సమూహంలో
'అట్టడుగున పడి కన్పించని కథల' సారాంశం-
కన్నకడుపు శోకంతో కుమిలి క్రుంగే దీనురాల్ని-
ఆకలి బాధకు అటమటించి అణగిపోయే అన్నార్తుణ్ని-
జీవితానికి క్షేమంలేని క్షుభిత క్షుద్రజీవుణ్ని-
మర్మమెరింగిన మానవలోకం, మాయలు పన్నే మహాత్ములు,
హృదయ రాహిత్యం సాధించిన ఆగర్భ శ్రీమంతులు-
లోకానికి శాంతి, సౌభాగ్యం, సౌహార్దం కావాలని చెప్పే
కమ్మని మాటల కాలుష్యంలో, కరుకు రూకల తాండవంలో
ఈ దీనులకు భాగంలేదని, యీ నిర్భాగ్యులకు తావులేదని
ఏమీ తెలియని యీ అమాయకులకు ఆశేలేదని
తెలిసిన నాకు, ఎరిగిన మీకు యీ లోకపు లుంరక
వాతావరణపు సరిహద్దుల్లో సమాగమం.

— సూర్యనారాయణమూర్తి

## సత్యాగ్రహ స్వామి !

దీపము ఆరిపోయినది ;
　　దివ్య మరీచులు దిగ్దిగ
చూపిన శాంతి కాంతి
　　కనుఁజూపును దాటె [illegible]
వ్యాపితమయ్యెఁ జీకటు
　　లవారణమై ; ఇక శోకదేవతా
నూపుర రావముల్ మిగిలె
　　నుర్వి సమస్తము ఝుర్ఝరిల్లగన్.

ప్రేమతోడ భరత భూమిని మా కిచ్చి
యనుభవింపుడనుచు నాజ్ఞనిచ్చి
ఋణముఁదీర్చుకున్న క్షణమైన నిలువక
వెడలిపోయినావ వెర్రి తండ్రి !

నీకు జగత్తులో ప్రతి
మరెవ్వరులేరు ; చరిత్రఁజూడగా
భీకర ఘోరయుద్ధ
మున వెల్లువగట్టు కవోష్ణరక్తమే
లేక జయంబులేదు
లవలేశముగూడ ; మహాత్మ నీవెగా
లోకములోన గెల్చితివి
లొంగని యుద్ధ మహింస శస్త్రమై.

అసమాన ప్రతిభా ధురంధరుఁడ
వౌ అన్నా ! మహాత్మాఖ్య ! నీ
యసమానాస్త్ర పదంబులైన
యల సత్యాహింసలన్ జూడగా
వెస జృంభించి లయించు
మారణ మహా విధ్వంస శస్త్రాస్త్రముల్
పసలేనట్టి వటంచుఁ జాటితివిరా!
బ్రహ్మాండ భాండమ్మునన్.

—పూభా

## శుష్క సుమము

ఏల పడియుంటి నేలపై నిచట నేను
ధూళి ధూసరితాంగినై తోచ దకట !
జిలుగు బంగారు సెజ్జలో చెలుల గూడి
కదలువేళను విభ్రమ మొదవె నేమొ.

చేతు లారంగ నను దీసి ప్రీతితోడ
తల్లిపాదాల కర్పించు తలపు కలిగి
అర్చక స్వామి కోవెల కరుగువేళ
పవనహతి నేల నేరక పడితి నేమొ.

తావులు చిమ్ముచున్ తలిరు
తల్పమునందు ప్రభాతవేళలో
జీవ మరందబిందువులు చిందుచు
నుండగ, ఇష్టదేవతా
సేవ లొనర్ప గోరు సుమజీవిత
మీవిధి శుష్క మయ్యె, నా
పాలన ప్రేమమూర్తివి, కృపామతివై
నను బ్రోవ జాలవా !

తల్లియొడి గాని, ప్రభుపాదాల చెంత
గాని నివసింప వలసినదాని కకట,
కంటకావృత మైన యీకాననమున
వాడిపోవుటయే విధి వ్రాసె నేమొ.

ఆకుమడగున పడిన న న్నాదరమున
చెలిమి పూసెజ్జలోపల జేర్చుకొన్న
నామనోహరదేవత నన్ను బ్రోవ
తరలి వచ్చును గావుత కరుణతోడ !

—పిండిప్రోలు

## సంజ మూల్గులు

ఎలా బ్రతకాలన్న చింత ఏనాడో వీడింది నన్ను
ఎలా చావాలన్న బాధ ఇంకా పీడిస్తూంది నన్ను

గతజీవిత గమనంలో ఎందుకో
మృత్యు దంష్ట్రలనుండి తప్పించుకున్నాను
కాని అదే అన్వేషణాపథంలోన
కానరాని ఆశాకుడ్యాలు ఛేదించలేకున్నాను

సరే బ్రదుకుదామెట్లైనా అనుకున్నా
ఈ ఎడారిలో వర్షం కురుస్తుందా
సాహసించి ఎట్లైనా చస్తామా
చచ్చిమాత్రం సాధించే దేమున్నది !

నేను చావాలని ఎవరికైనా
ఉందీ ?
పోనీ బ్రతకాలని మాత్రం ఎవరికుంది ?

లంచాలుతినే దేవుళ్లు
ఈ నిరుపేదను స్వర్గానికి
పోనిస్తారని నమ్మకమేముంది——

రేపు నా జీవితాన
మందారాలు సుమింపవచ్చు
ఈపూట బ్రతకడం తప్పు
కాబట్టి చచ్చి మళ్ళీ రేపు జీవిస్తే
బాగుండేది , కాని ఏంలాభం ?
చచ్చినవాళ్ళది బ్రతికినవాళ్ళకంటే
మెజారిటీ ఉంది
మెజారిటీలో కలిస్తే
నా ప్రత్యేకత ఏముంది ?
మెజారిటీ పార్టీ మైనారిటీల
బ్రతకకుండా చేసి
తమలోకి లాక్కోవడానికి
చూస్తున్నట్లుంది దగాచేసి——

'ఆత్మహత్య మహాపాపం'
అన్నారు ఆర్యులు
చావడానికి తలపెట్టడం
చట్టానికి ఎదురీదడం

చావడానికి వీలుకాకుండా ఉంది
బ్రతకడానికి బాట కనిపించడంలేదు
చావడం ఎలా అన్న ప్రశ్న
బ్రతకరాదా ? అంటుంది,
బ్రతకడం ఎట్లా అన్న ప్రశ్న
చావలేవా ? అంటుంది

వెనకాముందు ఆలోచిస్తే
ఎటూ తోచకుండా ఉంది
రక్తంలో సారంలేదు గాని
ప్రసారం ఇంకా ఉంది

చావు బ్రతుకుల సంజ
చాలా బాధాకరంగా ఉంది
చావు బ్రతుకుల సమస్య
చస్తే తేలుతుందా మరి—

— బాపురెడ్డి

## సమాంతరం

రాగపూరిత స్నిగ్ధ సుకుమార హృదయ వీవు
కాయజానల దందహ్యమాన మానసుడ నేను
నీసర్వమును నాకిచ్చి 'నీవు' లో 'నేను' జూచిన
సుకృతివి నీవు
నీ అఖిలమును దోచి 'నేను' లో 'నీవు'ను
హరించిన పాతకిని నేను
అతిపునీతమ్మయిన ఆశయమ్ములతోడ
ఆత్మార్పణ మొనర్చిన పుణ్యాంగనవు నీవు
అర్థరహితమ్మయిన అంగజాశలతోడ నిను
కబళించివేసిన కరకు పురుషుడ నేను
కోమలతా లాలిత్యమ్ముల గుబాళించు విరిపాన్పు నీమేను
కఠినతా కర్కశత్వమ్ములకు నెలవగు కంటకావళి నామేను
ఆర్ద్రరంజిత సహజ శీల సుగంధి నీమనసు
ఎడలేని ఆశలతొ ఎదురీదు దుర్గ్రహము నామనసు
జీవిత బుద్బుదమును అమరలహరిగజేసిన దివ్యశక్తివి నీవు
బ్రతుకు దీప్తిని మరుకేళి భంగపరచిన భ్రష్టజీవుడ నేను
మరుని నిర్జించిన అతిలోక మానవివి నీవు
మరునకు లోగిన అధమాధమ మానవుడ నేను

—జయశ్రీ

## సముద్ర మథనం

నేడు బ్రతుకు గాఢ నిద్రలో కలిగిన పీడకల
విస్మరించు గతాన్ని
చరిత్రను కరిచిన అనుభవాల వాసుకితో
మథించు ప్రస్తుతాన్ని

ప్రతివాడినెత్తినా మోయలేని బరువు ; తెలివికి కరువు
అయినా మునగదులే మందరం
మింగక, కక్కక, గొంతులో వుంచుకో చేదు
అమృతాన్ని సేవిద్దాం అందరం

బ్రతుకు కడలి అంచులు పొంగిన నురుగు ; కాంతికి పరుగు
ఇందులో పుడుతుంది వెలుగుతల్లి
ఆకాశంలో అందంగా ఎగిరే తెల్లని శాంతి పావురం
పండువెన్నెల జాబిల్లి.

మనం కోరుకుందాం సస్యలక్ష్మిని ముందు ; దీనికి మందు
ఆనకట్ట తగిలి ఆగే వాహిని
పొలంమీద పారేజలం జాతికిబలం; కడలిశత్రువును మాయచేసి
అదే మన కమృతం పంచే మోహిని.

ఎన్ని మార్పులు వచ్చినా, యీనాటి వంకర ధాత్రి
శబ్దించలేని తంత్రి
జగతిమాత శల్యాలను కొరుక్కుతినే సమస్తపురాణ రోగాలకు
మన చైతన్యం ధన్వంత్రి

—కుందుర్తి

## సంధ్యా సుందరి

పశ్చిమాశాంతరమ్మునఁ బగలు రేయి
రాపిడి జనించు నగ్నిహోత్రం బదేమొ !
కాక — కనకాద్రి రవి తురంగమ ఖురాళిఁ
గలయరేఁగినదేమొ బంగారు ధూళి !

ధాతుప్రస్తరముల్ ద్రవింపఁగ
దినాంత స్వర్ణ నైపథ్య సం
కేతస్థానమునన్ హిరణ్మయ
విపంచీ తంత్రులన్ మీటి సం

గీతం బిమ్ముగ నాలపించెడి
శుభాంగీ! మాకు నొందింపు మ
ద్వైతానందపదమ్ము రూప రస
గంధ స్పర్శ శబ్దంబులన్.

ఈ నీరామని మబ్బుతున్కలకొొసల్
హేమింప సిందూర శో
భానందంబులు సందడింపఁగను
సంధ్యా రంగమం దీవు కా
లూనన్ గేలు గదల్ప రక్తిమలు
గాయున్ రాగముల్ సాగు బా
లా! నర్తింపుము రాగ రక్తిమలు
కొొల్లల్ కొొల్లలై పోవఁగన్.

రాలె ముత్యాలు నీ నాట్య రభసమందు
వ్రీలెఁ గబరీభరమ్ము—నా కాలి క్రింది
కసవునుండి నక్షత్రలోకమ్ముదాఁక
ప్రాఁకిపోయె నిశ్శబ్దతా భరము తమము.

—ఉత్పల

## సంవత్సరాది

నెచ్చెలీ, ఒక్కసారి క న్విచ్చి కనుము !
అధిక సంతోషమున నూత్నహాయనంపు
జీవయాత్రను గడపగా సిద్ధ మైన
నెట్టి శుభసూచనమ్మొ నీ యెదుట బడెనో !

ప్రకృతికాంత వసంతదర్శనము కలుగ
ప్రియుని సంప్రీతితో నాదరించుకొరకు
చిగురుచీరె ధరించి విచ్చేసె నెదురు !

తరలి పోయిన పూర్వవత్సరముతోనె
సౌఖ్యహీనతయే మున్న సాగనంపు !
అభినవాబ్దము క్షీణించి యరుగుకాలది
శుక్లశశికళలను మీరు శోభ చెందు !

— నోరి నరసింహశాస్త్రి

## సాగర ఘోష

నీవు మనోహరుండ వయి
నిల్వగనే గగణాంగనమ్ముతో
పోవు జడత్వబుద్ధి ;
రసపూరిత భూరి మనోజ్ఞమైన నా
భావ తరంగమాలికలపై
బ్రసరింప త్వదీయ వీక్షణల్
జీవిత రాగమాధురుల
జిల్కు నిరంతర రాగగీతికల్.

అందము లారబోసికొని
అందని అంబరవీథి నుండు నీ
సుందరమూర్తి సోయగము
జూచుచు చూచుచు పారవశ్యము
నొందెంద హృదంతరాళమున
నుజ్జ్వలమౌ బడబాగ్నికీలయే
చిందును శీతలామృతము ;
చిత్ర మిదెక్కడి ప్రేమబంధమో !

అంతర మెంతయో కలుచు
        నైనను చంద్ర, యి దేమి వింతయో
సంతతముం ద్వదీయ
        సరసత్వ సుధామయ మైన స్పర్శలో
శాంతిని పొందు నీప్రణయ
        సాగరగర్భ మహాగ్నికీల లో
కాంతర దివ్యదీధితులె
        కన్నుల గప్ప, మనమ్ము విప్పగన్.

వలపుగుండెల బాడబవహ్ని కీల
లణచుకొందును నీ దరహాస సుధల
గ్రోలగా నిమ్ము సాగరఘోష వినుము
శారదా ప్రియ శర్వరీ సార్వభౌమ !

పార మెరుగని యీమహాప్రణయ హృదయ
భావదర్పణతలమున ప్రతిఫలించి
జిలుకురత్నాల కాంతుల జేర్చికొనుము
రమ్య లావణ్యకౌముదీ రాశిలోన

— పిండిప్రోలు

## సామాన్యుని శ్రీముఖం

1

ఓహోహో ! నేనే - నేనే !
ఈ హోరీ వుప్పెన నేనే !
చిరకాలం పీడకలల్లో
చెడి పలకని దరిద్ర గళమే
రాకాసుల కేకలు ముంచుకు
నాకానికి బాకాప్పైను !

2

ఢిల్లీలో ఖిల్లా రంగున
నాకూ ఒక గుండె వుందనీ,
ఆగ్రాలో తాజి తళుకుతో
నాదీ ఒక వెన్నెముకేనని,
చరిత్రలో పాతిపెట్టినా
జనవాక్యం చచ్చిపోదనీ,
పూర్తినిజం బయలౌతోందిక
భూగర్భం చీల్చుకు రవిగా !

## 3

అందరిపై కొందరి విందుల
సందర్భం బయటపడిం దిక-
అన్నిటితో ఆకలి మిగిలే
అభ్యుదయం అర్థమయిం దిక-
సాపం_క్తికి చావే తగిలే
సభ్యత గడు వయిపోయిం దిక !
ప్రేమమయం విశ్వం మధ్యని
పేల్చేసే కులమత వేధా,
'నీ' 'నా' మిష నేలా నింగీ
నెమరేసే పీడా గాథా,
ఆకలిలో నాకలి యాలీ
యవనికలై యంతర్నాటిక
లయిపోయా యాఖరి తెర తెగి-

## 4

రాజ్యాలే సామ్రాజ్యాలై,
రణరక్తపు వాణిజ్యాలై,

జీభూతం చీకటి కాదే
లాభంగా మిగలనివ్వనోయ్!
ఆకలి యెర అన్నే తమ్ముని
హతమార్చే రీతీ, జాతీ,
అమ్మకి కొడు కాలికి మగడూ
అవకుండా చేసే నీతీ,
ఆగాలిక సాగనివ్వనోయ్!
నానావిధ అధికారాల్లో
నా పేరిట స్వంతాలన్నీ,
అంతర్జాతీయ సభల్లో
శాంతిపేర పంతాలన్నీ
కొంత కొంత కనిపెడుతున్నా-
అంతానికి మొదలెడుతున్నా-

## 5

పెద్దలవే స్పర్ధలకోసం
నే నెందుకు చావాలంటా-
ఎద్దులతో నను జతచేసే
పద్ధతులకు 'బర్తరఫంటా-

కష్టపలం రావాలంటూ,
ఇష్టసిద్ధి కావాలంటూ-
తరతరముల అజ్ఞాతానికి
తదితర వర వకాలతులకీ
చెబుతున్నా స్వస్తి నేటితో-
నా బ్రతుకుకి నేనే భర్తను!
నా భావికి నేనే కర్తను!

## 6

ఏ తుపాకి పేలాలన్నా
చేతులు రెండెత్తే నేనే-
విమానాలు ముంచుక రేగే
విషాదాల మేఘం నేనే-
అణువు బాంబు లోపల దొలిచే
అమ్మ శక్తి ఆకలి నేనే!
సామాన్యుని అవతారంలో
ఓ మానవ భూకంపాన్నే'
'దాసోహం' తల కొట్టేసిన
ఆసామిని - సోహం! సోహం!

—కలపటపు రామగోపాల్

## దివ్య మానవుడు

నేను దానవుని సైతము
నిర్జించిన మానవుడను,
కాని మానవుని జయించ
లేని లోని మానవుడను.

వెదురుబొంగులో దాగిన
మృదు రసాత్తనాదమువలె ;
హంసముక్కులో నక్కిన
అతిలోక వివేచన వలె ;
మానవ పదవాచ్యుని ఎద
మలకలలో మరుగువడిన
అజ్ఞేయుడ నేను వివే
కజ్ఞేయుడ నేను సుమా!

ఒకని నీడ జూచి మరొక
డుల్కిపడిన విషమవేళ
ఒక్క గొంతుపై మరొక్క
ఉక్కుచేయి మసలువేళ ;

చూడలేక నోరురాక
స్రుక్కువడిన మానవుడను,
చిత్రమైన వ్యూహములో
చిక్కువడిన మానవుడను.

అసహిష్ణుత ఝంఝానిల
మై విరుచుక పడినప్పుడు

పశుతత్వము ఉరు తమస్స
దృశ్యమై ముసిరినయప్పుడు ;
ఆలంబనరహితమైన
ఆత్మవోలె నిల్చియుంటి ;
ఏ స్నేహబలమ్మునో
ఇంతదాక వెల్గుచుంటి.

నా కీర్తిని రాకా చం
ద్ర జ్యోత్స్నల బంతిలోన
సరి గద్దియ నిల్పెడు కాం
క్షా లేశము లేదునాకు.
ఆశించను గగన ధునీ
హైమాంభోజము లెన్నడు.
మట్టిలోన విరబూచిన
మల్లియ లిష్టములు నాకు.
నాచుట్టు భ్రమించెడు అం
ధలోకమును వెల్గించగ
బ్రతుకును కర్పమువలె అ
ర్పణసేయుట ప్రియము నాకు.

నేను కోరుచున్నది కుం
దేటి కొమ్మ గాదు ; ప్రకృతి
యందు ప్రతి పదమ్మునందు
ముందు నిల్చు పదార్థమ్ము.
అది అమృతాంధసులైనను
ఆస్వాదించని ఊహము
తన్నెరిగిన ప్రతివానికి
పెన్నిధాన మది స్నేహము.
ఆ స్నేహ మనోజ్ఞ భావ
నా స్నపితులలోన నేను
పాల కడలిలో వెన్నుని
లీల లీలగా నుందును.

సురభిళ శబ్దమ్మొక్కటి
తరగెత్తిన చాలు నా యె
డందసందులందు కోటి
నందనాలు గుబాళించు.
ఒక చాంద్రీమయ దృశ్యామ్మ
లిక ప్రసృతమ్మైనచాలు

నా మనస్సులో పుల్కలు
నారువోసినట్టు లౌను
ఇరుగుండియ లౌక సూత్రపు
విరులై కలిసిన చాలును
పొంగి నింగి నందుకొందు
భూదివమ్ము లతికినట్లు

స్ఫటిక స్వచ్ఛములుగ ఆ
భాసించిన అంతరంగ
ములలో నెత్తురు చారలు
మిలమిలమని కదలాడగ;
తన గుండెను చీల్చి దేవ
తల కమృతము పంచిపెట్టు
చంద్రునివంటి మహాత్ములు
క్షయగ్రస్తులగుచుండగ ;
నాలోపల నేదో మం
దరగిరి అట్టిట్టు కదలి
నట్టు లౌను; కాలకూట
ముట్టిపడిన యట్టులౌను.

పువురేకులలో పర్వత
మూలమ్ముల పెకలించెడు
వజ్రేయ మహాసంక
ల్పమ్మ నాంది పల్కునాడు ,

దీన జగద్రుధిర కణో
ద్దీప్త మనోవర్తులు చ
ల్లని స్నేహస్పర్శన మా
త్రమున వెల్గిపోవునాడు ;

పాపము పోలిక గుట్టలు
గా పుట్టలుగా పెరిగిన
జిఘాంస నేలమట్టమై
జిజీవిష చివుర్చునాడు ;
నాపై కన్పడు మానవ
రూపము సార్థకమ్మగును.

నా సంజ్వరితాత్మ కమృత
కాసారస్నాన మగును.

—సి నారాయణరెడ్డి

## సాహితీ లత

ఎవరు తుడిచితిరి నా యీ నిదుర కనులు ?
ఎవరు తెరచితిరి నా కీ వెలుగు కిటికీలు ?
సాహితీ లత, ఉషస్సౌహార్ద లేఖ,
నవ నవోన్మేష సుందర భావరస రేఖ.

ఎవరు తొలగించినా రీ యిరుల పరదాలు ?
ఎవరు వెలిగించినా రీ యరుణ కిరణాలు ?
సాహితీలత, ప్రేమ వాహినీగతిశీల,
సరస ప్రజా హృదయ సంలగ్న మూల.

వేయి రేకులు తొడిగి వికసించు నెవ రిదీ ?
వేదపూర్వము నుంచి వినిపించు నెవ రిదీ ?
సాహితి లత, అనంతాహి సుందరమూర్తి,
మధుర గాన రసాబ్ధి మాధవ స్ఫూర్తి.

ఎపటి కప్పుడె క్రొత్త, ఎవరిదీ రమత ?
ఎపటి కప్పుడె లేత, ఎవరిదీ మమత ?
సాహితీ లత, లస త్సర్వాంగ రాగ,
పూర్ణేందు రుచి భోగ పులకితావేగ.

ఎవరు నా కొసగిరీ నవరత్న పేటిక ?
ఎవరు నా కుంచిరీ పువు బొట్టు కాటుక ?
సాహితీ లత, విశ్వ సారస్వత విభూతి
అనునిమిషావిష్కృతానంద చిజ్జ్యోతి.

— భీమన్న

## సూచిక

[కవుల పేర్లు అకారాది క్రమంలోనూ, వారిని గూర్చిన వివరాలు యీ క్రింది క్రమంలోను ఇవ్వబడినవి. పూర్తిపేరు; ఇందు వారి రచనలు గల పుటలు; చిరునామా, వయస్సు, కృతులు.]

ఆనందమూర్తి, వేటూరి, ఎం ఏ ... ... 116

2-1-294 నల్లకుంట, హైదరాబాదు, 28, 'పూలవిందు' 'ముకుందమాల' 'విమర్శ వ్యాసములు' 'ఆధునిక భారతీయ చిత్రకళ' (అముద్రితములు)

" ఉషశ్రీ " ... ... ... 128

పురాణపండ దీక్షితులు, శ్రీపతి ప్రెస్, కాకినాడ, 28, 'రాగ హృదయం' గేయనాటిక, 'జగన్మోహిని' నవల, వచన మహాభారతము

" కుందుర్తి " ... ... 18, 83, 123, 143, 195

ఆంధ్రప్రదేశ్ పౌరసంబంధాలశాఖ, హైదరాబాదు, 36, 'తెలంగాణ' 'ఆశ' 'యుగే యుగే'

" గోపాల చక్రవర్తి " ... ... 168

నడిమింటి వేణుగోపాలశాస్త్రి, బి ఏ (ఆనర్స్), 27, 'కలంకలలు' వచన కవితా సంపుటి, గేయాలు, కథలు, వ్యాసాలు

" గోపీనాథ్ " ... ... ... 62

మునగపాటి శేషాచలపతి, భారత్ భవన్ హోటల్, హైదరాబాదు, 25, వివిధ పత్రికలలో హాస్య నాటికలు, వ్యాసాలు.

" చంద్రమౌళి " ... ... ... 57

వెంకటసుబ్బారావు హరి, బయలాజికల్ ప్రోడక్ట్సు లిమిటెడ్, హైదరాబాదు, 22, 'జీవితం' నవల, 'పగటి కలలు' నవలిక, 'ప్రజాసేవ' నవల, 'ఆమ్రపాలి' సంగీత నాటిక, 'కలువల రాణి - రేరాజు' గేయనాటిక (అముద్రితములు)

“ జయశ్రీ ” ... ... ... 107, 194

కాంభట్ల శ్రీరామ్, 5-1-170, జాంబాగ్, హైదరాబాదు, 22, వివిధ పత్రికలలో గేయాలు, కథలు, విమర్శక వ్యాసాలు.

“ దాశరధి ” ... ... 43, 71, 76

దాశరథి కృష్ణమాచార్య, ఆలిండియా రేడియో, హైదరాబాదు, 32, ‘అగ్నిధార’ ‘రుద్రవీణ’ ‘మహాంధ్రోదయం’ ‘మహాబోధి’ ‘పునర్నవము’.

నరసింహశాస్త్రి, నోరి, బి ఏ బి ఎల్. 10, 41, 172, 174, 199

న్యాయవాది, రేపల్లె, 58, ‘గీతమాలిక’ ‘సోమనాథ విజయము’ ‘భాగవతావతరణము’ ‘నారాయణభట్టు’ ‘రుద్రమదేవి’ ‘శ్రీదేవీభాగవతము’ ‘తేనెతెట్టె’ ‘కర్పూరద్వీపయాత్ర’ ‘వాఘిరా’ ‘మల్లారెడ్డి’, తదితర నాటకములు, కథలు, వ్యాసములు, ఖండ కావ్యములు.

నరసింహారావు, వేమరాజు బి ఏ. ... ... 149

1-1-230/16, వివేకనగర్, చిక్కడపల్లి, హైదరాబాదు; 29, వివిధ పత్రికలలో కథలు, గేయాలు, వ్యాసాలు, నాటికలు, విమర్శలు

నారాయణరావు, కాళోజి ... ... 124

నారాయణగూడ, హైదరాబాదు; 44, ‘కాళోజి కథలు’ ‘నా గొడవ’, ‘నా భారతదేశయాత్ర’ అనువాదం, ఇతర కథలు, ఖండకావ్యాలు.

నారాయణరెడ్డి, సి, ఎమ్. ఏ ... ... 206

ఆంధ్రోపన్యాసకులు, నిజాం కళాశాల, హైదరాబాదు, 28, 'నవ్వనిపువ్వు' 'జలపాతం' 'విశ్వగీతి' 'అజంతా సుందరి' 'నాగార్జున సాగరం' 'నారాయణరెడ్డి గేయాలు' 'స్వప్నభంగం' 'కర్పూర వసంత రాయలు' 'తేనె పాటలు' 'దివ్వెల మువ్వలు' 'వెన్నెలవాడ'; వివిధ పత్రికలలో వ్యాసాలు, ఖండకావ్యాలు

"పూభా" ... ... ... 187

సుభద్రాపురం, చీపురుపల్లి తాలూకా, శ్రీకాకుళం జిల్లా, 34, 'సంజదీపం' 'సంజప్రణయం' కథల సంపుటులు; వివిధ పత్రికలలో గల్పికలూ, కథలు.

బాపురెడ్డి, జె., బి ఏ ... ... 191

సిరికొండ, కరీంనగర్ జిల్లా, ఉస్మానియావిశ్వవిద్యాలయంలో ఎం. ఏ విద్యార్థి, 21, వివిధ పత్రికలలో పద్యాలూ, గేయాలూ, వ్యాసాలు.

బుచ్చిబాబు, ఎం ఏ ... ... 30, 31

ఆలిండియా రేడియో, హైదరాబాదు, 42; 'మేడమెట్లు' 'అడవికాచిన వెన్నెల' 'ఆశ్యాప్రియ' 'ఆమె నీడ' 'దేశం నాకిచ్చిన సందేశం' 'చైతన్య స్రవంతి' (కథలు); 'దారిన పోయే దానయ్యా' 'ఆత్మవంచన' 'ఉత్తమ యిల్లాలు' 'ఆదృతనలు' (నాటికలు), 'చివరకు మిగిలేది' (నవల)

ఆలిండియా రేడియో, హైదరాబాదు, 44, 'నాదేవి' 'మహా పరిణామం' (కావ్యాలు), 'సాధన' (నాటకం), వివిధ పత్రికలలో కథలూ, గేయాలు.



సచివాలయం, హైదరాబాదు, 35, చాలాభాగం అముద్రితాలయిన వివిధ గీతాలు, వ్యంగ్యాలు



లంక సూర్యనారాయణరావు, సచివాలయం, హైదరాబాదు, 29, వివిధ పత్రికలలో పద్యాలు, గేయాలు, కథలు.



ఆంధ్ర విశ్వ విద్యాలయములో సంస్కృతము (ఆనర్సు) విద్యార్థిని, సాహితీ సమితి, ఒంగోలు, 'తొలిపూలు' 'కావ్యమంజరి' 'హృదయాంజలి' 'అశ్రుగీతి' సమాగమము' 'ఆరాధన'కవిత, 'పహాలే పూల్' హిందీ పద్యసందోహము, 'నిరుపమ' నవల



మదరాసు విశ్వ విద్యాలయం తెలుగు శాఖాధ్యక్షులు,... ఉదాహరణ సాహిత్యంలోను, ప్రాచీనాముద్రిత గ్రంథాల విషయంలోను కృషి చేసి, వ్రాసిన అనేకమైన రచనలు, 'మించుపల్లె' పద్య కావ్యం.

వేంకటశివరావు, వడ్డి, బి ఏ., బి ఎల్. ... 166

అడ్వొకేటు, హైకోర్టు, హైదరాబాదు, 31, వివిధ పత్రికలలో పద్య, కథా రచనలు

శివశంకరస్వామి, తల్లావజ్ఝుల ... 1, 12, 27, 50, 130, 164

కాజగ్రామము, గుంటూరు జిల్లా, 66, మూడు సంపుటముల స్వతంత్ర పద్య గేయ కావ్యములు, కథానకములు, నాటికలు, వ్యాసములు, వేద ఋక్కులు, సంస్కృతమునుండి 'కథా సరిత్సాగరము', ప్రాకృతమునుండి 'గాథా సప్తశతి, పాలీభాష నుండి 'జాతక కథలు', వంగభాషనుండి నవలలు, హిందీనుండి కథలు మొదలయిన అనువాదాలు.

శ్రీదేవి, (డాక్టర్) పి, ఎం. బి, బి ఎస్ ... 139

45-A, మహాత్మాగాంధీ రోడ్, సికింద్రాబాదు, 29, 'ఉరుములు-మెరుములు' కథలు, 'కాలాతీత వ్యక్తులు' నవల

శ్రీనివాస సోదరులు ... ... 7, 95

శ్రీ శ్రీనివాస పార్థసారథి, శ్రీ శ్రీనివాస వేంకటాచార్యులు, శతావధానులు, అజంతా ప్రింటర్సు, పబ్లికేషన్సు యజమానులు సికింద్రాబాదు, 44-42, 'విచిత్ర రాఘవము' 'ఓరుగల్లు కోట' 'శబరి' 'ఆంధ్ర రాష్ట్రము' 'ఉపహారము' 'మన దక్కను' 'భామినీ విలాసము' 'శబ్దసిద్ధి' 'ఈశ్వర విజయము' 'భర్తృహరి నిర్వేదము' 'రాజ్యశ్రీ' 'వీరనారి' 'Concordance of Sutrapathas of various systems of Sanskrit Grammar' ఇత్యాది.

చట్టము (4) ఆంధ్ర కౌలుదారీ (5) హిందూదత్తతలు మరియు మనోవృత్తి చట్టము.

"స్ఫూర్తిశ్రీ" 113

టి. భాస్కరరావు, తెలుగు ఉపన్యాసకులు, ఆంధ్ర క్రైస్తవ కళాశాల, గుంటూరు, 30 ; 'దేవయాని' 'కన్నీటిజాలు' 'పరిణితి' 'అహల్య' 'ఆనంద మఠం' 'శకుంతల' 'నూటలతో మంతనాలు' 'శేషకవిత' (ముద్రితములు) 'మాధురీ స్రవంతి' 'మాళవిక' 'ఊర్వశి' 'మహాశ్వేత' 'భారత భారతి' (అముద్రితములు)

హనుమంతరావు, జూలూరి బి కాం 52, 87, 114

హైదరాబాదు, 27, వివిధ పత్రికలలో రచనలు.

వేంకట హనుమంతరావు, పిల్లలమర్రి, ఎం ఏ. 81

ఆంధ్రోపన్యాసకులు, హిందూ కళాశాల, గుంటూరు, 40, 'మధుకణములు' 'చిత్ర' 'వెలుగు నీడలు' 'పంచవటి పర్యాలోకనము' 'వ్యాకరణ దీపిక' 'సాహిత్య సమాలోచనము' 'వత్సల' 'సాహిత్య సంపద' 'సాహిత్య సమీక్ష' 'రాగరేఖలు' 'స్టూడెంట్స్ కంపానియన్' 'ధూప దీపాలు' 'ఇష్టాగోష్ఠి' 'మాధురీ మహిమ' ఇత్యాది

హృషీకేశవరావు, మానేపల్లి 25

విధానసభా కార్యాలయం, హైదరాబాదు, 23, వివిధ పత్రికలలో గేయాలు, కథలు.

## నవ్య సాహితీ సమితి

కార్యావర్గము :

ఆచార్య కురుగంటి సీతారామయ్య, అధ్యక్షులు
శ్రీ బోయి భీమన్న, ఉపాధ్యక్షులు
శ్రీ నిడుదవోలు వేంకటరావు, ఉపాధ్యక్షులు
శ్రీ పోతుకూచి సాంబశివరావు, ప్రధాన కార్యదర్శి
శ్రీ ఇసుకపల్లి దక్షిణామూర్తి, కార్యదర్శి
శ్రీ పి ఎస్ ఆర్. అంజనేయ శాస్త్రి, పత్రికా సంపాదకుడు
శ్రీ టి. వి భద్రిరాజు, కోశాధికారి
శ్రీ అక్కిరాజు జనార్దనరావు, కార్యాలయ కార్యదర్శి

సాహిత్యోపసంఘం :

శ్రీ తురగా కృష్ణమోహనరావు (అధ్యక్షులు)
శ్రీ సురమౌళి
శ్రీ పాలంకి వెంకటరామచంద్రమూర్తి
శ్రీ పి. ఎస్ ఆర్ అప్పారావు
కుమారి ఎం. జానకీరాణి

ఆర్థికోపసంఘం :

శ్రీ వేమరాజు నరసింహారావు (అధ్యక్షులు)
శ్రీ ఎ. నారాయణరెడ్డి
శ్రీ జూలూరి వీరేశలింగం గుప్త
శ్రీ ఎన్ సి. ఎస్. వెంకటాచారి
శ్రీ యం. రఘురామారావు

నాటికోపసంఘం :

డా. మారేమండ రామారావు (అధ్యక్షులు)
శ్రీ డి రాజేశ్వరరావు, కార్యదర్శి
శ్రీ న్యాపతి రాఘవరావు
శ్రీ పన్నూరి రామారావు
శ్రీ కురుగంటి కృష్ణమూర్తి

శ్రీ చంద్రమౌళి

శ్రీ బి కృష్ణంరాజు

శ్రీ కే వీరరాజు

శ్రీమతి టి ప్రసన్నకుమారి

ప్రతినిధివర్గము :

శ్రీ భాస్కరభట్ల కృష్ణారావు, హైదరాబాదు

శ్రీ రాయప్రోలు మార్తాండం శ్రీనివాస్, సికింద్రాబాదు

శ్రీ అప్పిచెర్ల సుబ్బారావు, మద్రాసు

శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి, విజయవాడ

శ్రీ కాలనాధభట్ట వీరభద్రశాస్త్రి, రాజమండ్రి

శ్రీ పి సూర్యనారాయణమూర్తి, ,,

శ్రీ సోమంచి యజ్ఞన్నశాస్త్రి, బొంబాయి

శ్రీ పి డి నాగేశ్వరరావు, ,,

శ్రీ నాయుడు వెంకట సీతారామమూర్తి, ఆలమూరు

శ్రీ కే. ఎల్ నరసింహారావు, రేపాల

శ్రీ నోరి నరసింహ శాస్త్రి, రేపల్లె

శ్రీ కంచి వాసుదేవరావు, మచిలీపట్నం

శ్రీ పూ. భా. విజయనగరం

శ్రీ ఉషశ్రీ, కాకినాడ

శ్రీ మధురాంతకం రాజారాం, చిత్తూరు

శ్రీ సిద్ధాంతి మల్లికార్జునం, నెల్లూరు
శ్రీ ముద్దంశెట్టి హనుమంతరావు, ఖర్గపూర్

పోషకవర్గం :

న్యాయమూర్తి శ్రీ పి. వి. రాజమన్నారు, మద్రాసు
శ్రీ ఎం. ఆనందం, సికింద్రాబాదు
శ్రీ సి. హెచ్. హనుమంతరావు, హైదరాబాదు
శ్రీ నానాగౌడ్, హైదరాబాదు
శ్రీ వి. రామలింగస్వామి, బొంబాయి
శ్రీ బుర్రా వెంకట సుబ్రహ్మణ్యం, హైదరాబాదు
శ్రీ కె వి నారాయణ, హైదరాబాదు
శ్రీ సిర్నం సత్యనారాయణ గుప్త, సికింద్రాబాదు
శ్రీ బెల్దె జగదీశ్వరయ్య, సికింద్రాబాదు
శ్రీ ఎ. రామచంద్రారెడ్డి, హైదరాబాదు
శ్రీ వల్లూరి వెంకటేశ్వర్లు, హైదరాబాదు
శ్రీ బి. వి సుబ్బారాయుడు, హైదరాబాదు
శ్రీ పర్సా వేంకటేశ్వరరావు, హైదరాబాదు
న్యాయమూర్తి శ్రీ కందా భీమశంకరం, హైదరాబాదు
శ్రీ పబ్బా శంకరయ్య, హైదరాబాదు
శ్రీ పి తిరుమలరావు, హైదరాబాదు
శ్రీ ఎం. ఎల్. ఎన్ రావు, బొంబాయి
శ్రీ కల్లూరి సుబ్బారావుగారు, హైదరాబాదు